*Didicated to Rajah M. Bhujanga Rau Bahadur Zamindar.*

# ANDRA PARASERA SMRITI.

By A. Prabhakara Kavi.

THE MANJUVANI PRESS, ELLORE

*Printed by N. Chalapati Rau--500 Copies.*

# ఆంధ్రీకృతపరాశరస్మృతి

ఇది

గద్వాలసంస్థానకవులగు ఆదిపూడి ప్రభాకరకవిగారిచే

రచియింపఁబడి

అష్టావధాని శ్రీరాజా భుజంగరావు బహద్దర్

జమీందారుగారికి

కృతియీయఁబడెను.

FIRST EDITION. 500 COPIES.

*The Manjuvani Press,*

ELLORE.

1900.

 *Price 8 Annas.*

*Printed by N. Chalapati Rau*

శ్రీరస్తు.

శ్రీమార్కండేయేశ్వరాయనమః.

# ఆంధ్రపరాశరస్మృతి.

[ప్రథమబింబము.]



శ్రీప్రాలేయనగాత్మజం గని జటో-ద్దీపంబునన్
బ్రోఁగు గం-
గాప్రాణేశ్వరిఁ జేర్చె వామకరమా-గ్లారేఖఁ
దాఁ జేర్చె మి-
థ్యాప్రేమల్ మగవారివంచలుగురు-ద్రాణిం
గృపోదంచితుం-
డై ప్రార్థించు శివుండు ప్రోచుత భుజం-గాధీశ్వ
రగ్రామణిన్॥ ౧॥

సీ. కరుణాంబువులకు నా-కరమై పిసాళించు,
కన్నులవిస్ఫులిం-గములు రాలఁ
గ్రొందమ్మిపూలకు-విందైగు బాళించు,
కరములఁ గోదండ-కాండము మరఁ

గరలినవాతుచ - క్కెరలబు రాయించు,
పలుకులహుంకృతుల్ - పరిఢవిల్ల।
శృంగారరసపూర్వ - రంగమైతవణించు,
మేనవీరరసంబు - మేకొనంగ।

గీ. శిష్టులనుబ్రోతు నేనువి - శిష్టదుష్ట।
సమితిఁబొలియింతుననుచుర - క్షస్సమూహ।
మడలసింగంబుదఱుటు చు - నడరుదుర్గ।
భుజగరాజేంద్రునకరాతి - విజయమొసఁగు॥

మ. కిటివైయుండుటనీకులెస్సఁదగుశా - ర్ఙ్గీయంట్రఁగారాకుమం।
చటుదౌదౌవులఁగేరడాల్వలుకుప - ద్మాబ్జాక్షిఁగేల్వట్టికాఁ।
గిఁటికింబార్చువికుంఠనాయకునియ - క్షీణోద్యమంబిప్పుడి।
క్తటవిఖ్యాతయశుఙ్భుజంగవిభుని - త్యశ్రీయుతుంజేయుతఙ్॥

సీ. ఏరామకలశపా - థోరాశియుప్పొంగ,
నమృతంబుతోడఁదా - నవతరించె।
నేకన్యపదునాల్గు - లోకముల్ పాలించు,
విష్ణుదేవునికిదే - వేరియయ్యె।
నేతల్లియీజగ - త్సృష్టికాద్యుండగు,
నబ్జసంభవుఁగడు - పారఁగాంచె।
నేయమ్మతనదృష్టి - యిసుమంతసోఁకిన,
మనుబంగరువు సేయు - మహిమవఱసె।

గీ. నేమహాసాధ్విమంగళ - నామవర్ణ।
జపములక్షరదివ్యమో - క్షప్రదమ్ము।
లట్టిశ్రీదేవిభూరిద - యాంతరంగ।
శ్రీభుజంగావనీంద్రుర - క్షించుఁగాత॥

మ. సతివీణాశ్రుతి కెల్లుజొన్పి నిగమ-స్వాధ్యాయనిష్ఠాలస
న్మతిఁ గాంధమ్మిఁ దదంసమయ్యె ననుమం-డాఁ జేసి మానీంద్రసే।
వితుఁడై లోకములన్విధించు సకలా-భీష్టప్రదుండిద్ధధీ।
యుతుఁ డా ధాత భుజంగ భూవిభుఁ జిరా-యుష్మంతుఁ
గావించుత న్॥ ౫॥

సీ. సిద్ధాన్నమిది యంచుఁ-జేదోయిఁ గబళింప,
నరయు రాయంచ పు-ద్దాడి దువ్వ।
పలుకు పలుకునకు మా-ర్పలుకుచుఁ దర్కించు,
కీరపఙ్క్తులకుఁ జ-క్కెరలు గ్రుక్కి।
యాసవం బానీగా-నాననమ్మునఁ గ్రమ్ము,
భ[illegible]లమ్ములకు శిరః-ప్రసవమిచ్చి।
యందంద వీణార-వానందమునఁ జొక్కు,
పతికిఁ గన్మోవియా-మెతయొసంగి।
గీ. నాకతరువనితనుఁ గొల్చు-నాకువిమల।
నవరసనిధానకవితాధ-నంబొసంగి।
యోము భాషావధూటి య-భ్యుదయపేటి।
మా భుజంగావనీనేత-మనుముఁ గాత॥ ౬॥

చ. అజరతరంగిణీహ్రదసి-తాంబురుహభ్రమఁ బాతమాళిన।
కజ్జమగు చంద్రుఁ బట్టునొడి-కంబునఁ దుండముఁ బైకిఁ జాఁచియ।
ద్రిజనునగించు నొంటిపలు-దేవర పూనిభుజంగరాయభూ।
భుజుని నిరంతరాయసుఖ-ముల్ దయ చేసి కృతార్థుఁ జేయుత న్॥ ౭॥

శా. లోకత్రాణపరాయణుల్ ఘనులు సుశ్లోకుల్ తపోధీనవు।
వ్యాకారుల్ భగవత్కథామృతకృతా-ర్థాత్ముల్ మహాధన్యుల।
స్తోకానేకపురాణకర్తలు వచ-శ్శుద్ధిం బ్రసాదించి మా।
శ్రీకీ వ్యాసపరాశరాదిమునులో-లిన్నన్ను మన్నించుత న్॥ ౮॥

చ. ఒలిచియనంటిపండుకయి-నుంచినపోలికసంస్కృతంబునం।
గలిగినభారతప్రముఖ-కావ్యములాంధ్రమునందుఁదేటఁగా।
వెలయఁగఁజేసియెక్కుడుప్ర-వీణతపొల్పెసఁగంగఁగీర్తిఁగ।
న్నలలితమూర్తులంగొలుతు-నన్నయఁదిక్కననెఱ్ఱనార్యనిన్॥ ౯॥

ఉ. బెబ్బులిఁగాంచిఫేరవము-వెఱ్ఱితనంబునదేహమంతయున్।
బొబ్బలువారఁగాల్చికొని-బ్రుంగినభంగిమహాకవీంద్రులన్।
దబ్బునఁజూచినంతటన-దబ్బఱకబ్బములల్లియుబ్బుచున్।
సిబ్బితిలేకలోకమునఁ-జెప్పుడువారిస్మరింపనేటికిన్॥ ౧౦॥

వ. అనియిట్లాశీఃపూర్వకంబుగాఁ గృతిపతికొ[illegible]కాదిమదంపతి త్ర
యాభివందనంబొనరించి దయాసదను[illegible]గరివదనుఁ గీర్తించి దివిజ
త్రిలింగభాషా కవితాసనాథ సనాతన కవినాథుల సుప్రసన్ను
లం జేసికొని కింపచానులుం బ్రాడ్వివాకులునగు కాకవులు ఘూ
కవులట్లు ప్రస్తావనానర్హులయ్యు నార్య మర్యాదా నివార్య
మూలంబునఁ దదీయాసార గుణగణం బొక్క ఫక్కి నుటంకించి
యొక్కనాఁడేను శ్రీశారదానుపమ ప్రసాద సమాసాదితాస్మత్క
వితా లహరి నెట్లు ప్రవహింపఁ జేసినఁ బ్రాపంచిక పారమార్థిక
వాంఛితార్థంబులు సఫలీకృతంబులై చరితార్థుఁడ నగుదునో య
ని చింతించుచున్న సమయంబున. ౧౧॥

సీ. వేదాంతవిదులగు-విప్రవర్యులతోడ,
వీరులౌ క్షత్రియ-వితతితోడ।
వాణిజ్యనిపుణులౌ-వైశ్యవర్గముతోడ,
వినతులౌ హాలిక-జనులతోడ।
సౌందర్యవసతులౌ-సతులబృందముతోడ,
రాజితోన్నతసౌధ-రాజితోడఁ।

గమలాకరంబులతో - కాసారములతోడ,
సుమఫలభరితవ-నములతోడ।
గీ. విమలవిస్తారఘంటాప-థములతోడ।
హరులకన్నులగువగు-హరులతోడ।
గిరులకన్నసుగొప్పగు-కరులతోడ।
సురుచిరంబగునేలూరు-పురమునందు॥ ౧౨॥
సీ. ఎవ్వానియవతార-మిద్ధమంత్రిప్రెగ,
డాన్వయాంబునిధిక-బ్జాగమంబు।
లక్కవరాదివె-ల్లాసీమలెవ్వాని,
పాలనంబునబాగు-పడినయూళ్ళు।
నేవానిగీర్తికాం-తావాసమునకుబ్ర,
హ్మాండభాండంబొక్క-యలఁతిమనికి।
యెల్లదిక్కులనుండి-యేతెంచువిబుధుల,
కెవ్వానికైపండ-యీఁగిగ్రామాను।
గీ. మృదుకవిత్వంపుశుకమున-కెవనిసరస।
వాగ్వితానంబుబంధుర-పంజరంబు।
ప్రబలబలశాలియతఁడార్య-వనజహేళి।
సారగుణశీలిభుజగరా-జన్యమాళి॥ ౧౩॥
మ. నిజసౌధోపరిభాగమందుఁద్రిజగ-న్నేత్రోత్సవంబైసిత।
ధ్వజవిభ్రాజితమైకడుంబొలుచునా-స్థానంబునంబ్రతలా।
భిజయద్యోతకనూత్నకాంతులుముఖా-బ్జశ్రీమిటారింపవా।
రిజనాభోన్నతవైభవంబెసఁగసం-ప్రీతిన్సుఖాసీనుఁడై॥ ౧౪॥
సీ. కరకంకణధ్వనుల్-ఘల్లుఘల్లనిమ్రోయ,
సుందరాంగనలు-వీవోపులిడఁగ।
విద్వన్నికాయంబు-వివిధశాస్త్రార్థముల్,
సిద్ధాంతములుసేసి-చెప్పుచుండ,

వందిమాగధబృంద-మందందబిరుదముల్,
వొగడుచుం గెలంకుల-నెగడుచుండ,
వీణారవానూన-రాణామృతంబుల,
గాణీలు రాల్గురు-గంగ బాడ।

గీ. మంత్రిబాంధవమిత్రసా-మంతగణము।
బలసికొలువంగ దేవేంద్ర-వైభవమున।
నిండుకొలువుండినన్నుమ-న్నించిపలికె।
భవ్యతరకర్ణభూషణ-భాషణముల॥ ౧౫॥

గీ. కందరామాయణముమహా-నందసరణిఁ
జెప్పి శ్రీరామభూపాల-శేఖరునకుఁ।
గృతియొసంగిజగద్ధిత-కీర్తిఁగంటి।
వాదిపూడిప్రభాకరా-ఖ్యకవిచంద్ర॥ ౧౬॥

ఉ. చక్కనినీకవిత్వమది-చక్కెరయుక్కు-అలట్టులైచవుల్।
గ్రక్కుచునుండుఁగావునని-కానొకసత్కృతినిన్ను వేడమా।
కెక్కుడుకాంక్షయున్నదిక-వీశ్వరకాదనకుండఁదేటయా।
ఫక్కిఁబరాశరస్మృతిఁగృ-పామతిమాకుఁదెనుంగుఁజేయవే॥ ౧౭॥

మ. ఘనవాణీప్రథమానుకూల్యమునవి-జ్ఞానేశ్వరీయంబుఁగే।
తనదాఁదెల్గొనరించెమున్నుఁబరమా-ర్థజ్ఞానియైనాదుప్రా।
ర్థననీవిత్తఱిఁగౌరవించిబడిఁబా-రాశర్యమాంధ్రీకరిం।
చునను కృతధన్యునిఁజేయుమయ్యగుణరా-శీమంత్రిచూడామణీ

ఉ. “గొప్పప్రబంధరాజమునకుందగునట్టిమదియవాగ్విధం।
బిప్పుడలంతియాకృతికి-నెట్టులుఁజొన్పుడు” నంచునెంచకే।
చొప్పునసైనస్వల్పమని-చూడకయిప్పనికొప్పుకొన్నచోఁ।
దప్పకనీకునాకునుయ-థార్థసుఖంబులుదీనఁజేసురుణ॥ ౧౯॥

వ. అనినయవినయ విశ్వాసభయభక్తి తాత్పర్య పురస్కృతంబుగా ననేక చిరత్నరత్న భూషావిశేషంబుల నన్నాదరించి సారఘనసార సారంగమద వాసనా భాసురంబగు తాంబూలం బొసంగుటయు నమందానంద తరంగితాంతరంగుండనై మహా ప్రసాదంబని యంగీకరించి తద్గ్రంథానుసంధానంబునకు జాత కౌతూహలుండ నగుచు నేతత్కృతినాయకరత్నాన్వవాయ క్రమం బభివర్ణించెద.

## కృతిపతి వంశాభివర్ణనము.

సీ. ఆద్యంతరహితుఁడై-యఖిలలోకంబులుఁ,
దానయియెవ్వాఁడు-తనరుచుండు।
సకలచరాచర-జంతుజాలంబులు,
పొలుపొందనెవ్వని-బొజ్జనుండు।
వాయ్వగ్నిసూర్యేందు-వసుధాతలంబులె,
వ్వానియానకుఁదల-వంచినడచు।
మూర్తిత్రయంబుసం-పూర్ణమైయెవ్వని,
గాత్రంబునందుఁబ్రి-కాశమొందు।

గీ. నట్టియాదివిరాట్టుము-ఖాగ్రసీమ।
బ్రహ్మతేజోవిశేషసం-పత్తితోడ।
వేదములతోడఁబుట్టునై-వినుతికెక్కె।
నగ్రవర్ణంబువిమలశో-భార్ణవంబు॥ ౨౧॥

వ. అందు ౨౨॥

సీ. ఒకచేతగోముఖం-బొకచేశిలీముఖం,
బెవ్వారుధరియించి-రేపుమీఱ।
నొకవంక వేదంబు-నొకవంక ఖేదంబు,
నెవ్వారుదాల్చిర-హీనబుద్ధి।

నొకకంటయోగంబు-నొకకంటభోగంబు,
నెవ్వారువరియించి-రిద్ధశక్తి।
నొకచోనుపేంద్రుని-నొకచోసురేంద్రుని,
నెవ్వారుసేవించి-రింపుతోడ।

గీ. నాగ్రహానుగ్రహసమర్థు-లైరెవారు।
శాపమునఁజాపమునశక్తిఁ-జూపిరెవరు।
బ్రాహ్మ్యమునక్షాత్రమునఁగాడఁ-బ్రబలిరెవ్వ।
రట్టివారాఱువేలవా-రందులోన॥ ౨౩॥

శా. శ్రీమంత్రిప్రెగడాన్వయంబవికల-శ్రీనొప్పఁదజ్జాతుఁడై।
హేమాద్రిస్థిరధైర్యుఁడప్పలధరా-ధీశుండువైమానిక।
స్వామింగన్నడసేయుభోగమునభూ-చక్రంబుపాలించెఁబో
ద్ధామప్రాభవశక్తినర్థిలోకులమం-దారంబతండల్పుఁడే॥ ౨౪॥

సీ. ఏదారిఁగనుఁగొన్న-నాదయామయునన్న,
సత్రముల్ మృష్టాన్న-సమితిఁబెట్టు।
నేభూమిఁగాంచిన-నాభోగిడించిన,
కొలఁకులునిర్మల-జలములొసఁగు।
నేదిక్కుఁజూచిన-నాదాతప్రోచిన,
వనపఙ్క్తులుత్కృష్ట-ఫలములీను।
నేనేలఁజుట్టిన-నానేతగట్టిన,
దేవళంబులుస్వామి-సేవలిచ్చు।

గీ. నేనెలవుమెట్టిననుగాని-యాన్నపాలు।
చరితమానందకందమై-సజ్జనులకు।
వాంఛితార్థంబులెల్లస-ఫలముసేయు।
రాజమాత్రుండెయప్పల-రాజవరుఁడు॥ ౨౫॥

ఉ. అంబుజనాభుఁడిందిరక-రాబ్జము వట్టిన రేఖదోఁపరా।
మాంబను సద్గుణాళిజగ-దంబను నాతఁడు పెండ్లియాడెసూ।
నాంబక దివ్య విగ్రహున-నంత బలాఢ్యునిఁబూర్ణ శీతరు।
గ్బింబసమాన వక్త్రునరి-భీకరుఁగాంచెఁగుమార శేఖరున్॥ ౨౬॥

సీ. బుద్ధికౌశల్యంబు-పొలుపొందఁగోటాన,
కోట్లుధనంబులు-గూడఁబెట్టి।
రజతాద్రికెక్కుడై-రాణించుప్రాసాద,
ములుకొల్లకొల్లఁగా-వెలయఁజేసి।
ప్రబలులైయొప్పఁగడు-పార్థివేంద్రులతోడఁ,
దుల్లతూగివారితోఁ-జెలిమినెరపి।
రాజాదిబిరుదముల్-రంజిల్లఁగానూత్న,
రాజ్యలక్ష్మివరించి-పూజ్యతఁగని।

గీ. చిన్నమాంబయు శేషమ్మ-సీతమాంబ।
రంగమాంబయుభక్తిని-రంతరంబుఁ।
దన్ను సేవింపఁగీర్తికాం-తాభుజంగుఁ।
డాతఁడుభుజంగరాయవి-ఖ్యాతుఁడగుచు॥ ౨౭॥

సీ. గోత్రపావనుఁడయ్యు-గోత్రాధిపతియయ్యు,
భూరిభోగమునగో-త్రారియయ్యెఁ
గవులనేత్రుండయ్యుఁ-గమలాప్రియుండయ్యు,
నౌదార్యమునఁగమ-లారియయ్యె।
దానవీరుండయ్యు-దానశూరుండయ్యుఁ,
బాలనంబునదాన-వారియయ్యెఁ।
బురపాలకుండయ్యుఁ-బురుషోత్తముండయ్యు,
నరిభండనమునఁబు-రారియయ్యె।

గీ. ననుచు జగదభినుతిఁ గాంచె-నమ్మహేంద్రుఁ।
డాకళానిధియాన్వహ-ర్యక్షుఁ డాప।
రాజితద్విజరాజమూ-ర్ధన్యుఁ డాభు।
జంగరాజన్యుఁ డాభృత-సజ్జనుండు॥ ౨౮॥

ఉ. అమ్మహిదైవతాగ్రణిస-మంచితభక్తిదలిర్పఁ గొల్చువా।
రమ్మహిషీచతుష్టయము-నందు గరీయసి-చిన్నమాంబ శే।
షమ్మద్వితీయభార్య తద-నంతర ప్రేయసి సీతమాంబ రం।
గమ్మతురీయరాజ్ఞి యిటు-లాసుదతీమణులొప్ప వారిలోన్॥ ౨౯॥

సీ. అతిచంచలత లేని-పతిభక్తి యొదఁబూని,
గరువంపు పడమాని-పరగు నేనిఁ।
పెక్కుభర్తలు వీడి-యొక్కని నేకూడి,
చలనంబు పోనాడి-చెలఁగు నేని।
నత్తయొత్తిడి కోర్చి-యడకువ మదిఁ జేర్చి,
యొంగిలి యిలుమార్చి-యొసఁగు ననిఁ।
జట్టుపుట్టువుగాక-సవతిజోలికిఁ బోక,
గడుసుఁదనము లేక-నడచు నేని।

గీ. శ్రీమహాలక్ష్మి ధరణివా-ణీమృడాణు।
లోకవిధమ్మున సాటిసే-యుటకుఁ దగుదు।
రతులశుభవతికుత్ర్యష్ట-ధృతికసదృశ
సారమతికి సుకృతికి శే-షమ్మసతికి॥ ౩౦॥

ఉ. ఆయతమైనవిద్య విన-యమ్మును బోధనశక్తి పుట్టున
ట్టాయమగర్భమందుదయ-మైగి శశాంకనిభాననల్ దటి।
త్ప్రియతనూసముజ్జ్వలల-పారసతీహితదానధర్మని।
ష్ఠాయుతలిద్దఱంగనల-సామ్యలు సుబ్బమ శేషమాఖ్యలన్॥ ౩౧॥

గీ. వారిలో సుబ్బమారావు-పరమభక్తిఁ।
గౌరిశౌరియించెగురుజాడ-కులపవిత్రి।
వీరభద్రార్యునతులవి-వేకధుర్యు।
స్థైర్యజితకాంచనాహార్యు-సచివవర్యు॥ 3౨॥

గీ. పిదపశేషమ్మరావుసం-ప్రీతి వాడ।
రేవుకులచంద్రుశ్రీరామ-ధీవరేంద్రు।
విమలగుణసాంద్రుఁబెండ్లియై-హిమకరాభుఁ।
గాంచెనరసింహరాయవి-ఖ్యాతపుత్రు॥ 33॥

వ. ఇప్పగిది నాద్రరామర శిరోభూషణంబు ద్వితీయకళత్రింబునం దు నిష్కళంకపుత్రికా సంతానంబు సంతానసమంబుగఁబడసె నయ్యది తామరతంపరై చెలువొందు నెడ. 3౪॥

సీ. గరితెలతలసొమ్ము-గయ్యాళితలదిమ్ము,
పతిభక్తికిరవుడు-వ్రతులగురువు।
మరియాదలకునీడ-గరువమ్మునకుఁజీడ,
దయకుఁబుట్టిల్లుని-దక్షాయకుముల్లు।
పరమార్థములవాడ-పాపమ్ములకుఁబీడ,
కలుములపంటలే-ములకుఁదంట।
యడకువలకువీడు-దుడుకులకుఱిత్రాఁడు,
గానములకరువుడు-గుణాణఁపుగను।

గీ. సత్యములకాటపట్టున-సత్యములను।
మాన్పుటకుఁజాలు వాకట్టు-మందు చెట్టు।
మేలులకుగీముకీడుల-పాలిగాము।
యారెయిలఁగల్పవల్లి పి-న్నమ్మతల్లి॥ 3౫॥

ఉ. సంచితభాగతీతబహు-జన్మతపఃపరిపాకవాసనన్।
మంచికుమారుమారసుకు-మారుఁగుమారజయిప్రితాపుడు।

గాఁంచితమల్లికార్జునస-మాఖ్యనినాయమకాంచికాంచెఁగ్రొ
మ్మించులమించుబోఁడిరతి-మించినవొక్క-కుమారికామణిన్ ॥౩౬॥

క. ఆయమ్మతన్నునిటురా।
మాయమ్మాయనుచు వాగు-మామాయోషల్।
వీయమ్మఁబిలువఁగరా।
మాయమ్మాయనెడుపేర-మహిఁరంజిల్లెన్॥ ౩౭॥

క. కురుమద్దాలకులాంబుజ।
తరణిన్ గోపాలకృష్ణ-ధరణీసురుధీ।
వరునిన్ వరునిగ నాసతి।
వరియించెన్ మంచియసము-వరియించెఁధరన్॥ ౩౮॥

సీ. ఎవనిపరాక్రమం-బినుప్రతాపముఁగ్రిందు,
పఱపభానుఁడుశీత-భానుఁడయ్యె।
నెవనిదానముకల్ప-వృక్షంబుమీఱఁగా,
దేవతలెల్లభూ-దేవులయిరి।
ఏసభ్యకీర్తిన-దీసంగమంబున,
వార్ధినిమ్మహిక్షీర-వార్ధియయ్యె।
నేమహీపాలుండు-భూమిపాలింపఁగ,
రాజ్యంబుశ్రీరామ-రాజ్యమయ్యె।

గీ. నతఁడతిగభీరుఁడతిధీరుఁ-డత్యుదారుఁ।
డభ్రగంగాప్రవాహశు-భ్రాంశుహంస।
హీరనీహారఘనసార-సారకీర్తి।
మల్లికార్జునరాయాఖ్య-మహితమూర్తి॥ ౩౯॥

సీ. కట్టించెనేతల్లి-కైలాససమముగా,
రమణీయమైనస-త్రముల్గములు।

గాఢాంచితమల్లికార్జునస-మాఖ్యనినాయమకాంచికాంచెఁగ్రో
మ్మించులమించుబోడిరతి-మించిననొక్క-కుమారికామణిన్॥౩౬॥

క. ఆయమ్మతన్నునిటురా।
మాయమ్మాయనుచు వాగు-మామాయోషల్।
వీయమ్మువఁబిలువఁగరా।
మాయమ్మాయనెడు పేర-మహిరంజిల్లెన్॥ ౩౭॥

క. కురుమద్దాలకులాంబుజ।
తరణిన్ గోపాలకృష్ణ-ధరణీసురుధీ।
వరునిన్ వసునిగనాసతి।
వరియించెన్ మంచియసము-వరియించెధరన్॥ ౩౮॥

సీ. ఎవనిపరాక్రమం-బినుప్రతాపముఁగ్రిందు,
పఱపభానుఁడుశీత-భానుఁడయ్యె।
నెవనిదానముకల్ప-వృక్షంబుమీఱఁగా,
దేవతలెల్లభూ-దేవులయిరి।
ఏసభ్యుకీర్తిన-దీసంగమంబున,
వార్ధినిమ్మహిక్షీర-వార్ధియయ్యె।
నేమహీపాలుండు-భూమిపాలింపంగ,
రాజ్యంబుశ్రీరామ-రాజ్యమయ్యె।

గీ. నతఁడతిగభీరుఁడతిధీరుఁ-డత్యుదారుఁ।
డభ్రగంగాప్రవాహశు-భ్రాంశుహంస।
హీరనీహారఘనసార-సారకీర్తి।
మల్లికార్జునరాయాఖ్య-మహితమూర్తి॥ ౩౯॥

సీ. కట్టించెనేతల్లి-కైలాససమముగా,
రమణీయమైనస-త్రములగములు।

పెట్టించె నేమాత-పొట్టలు ప్రిదులఁగా,
నభ్యాగతులకుఁబ-క్వాన్న పఙ్క్తి।
దట్టించె నేయమ్మ-దయదనివారఁగా।
బీదలపాలదు-ర్భిక్షములను।
నెట్టించె నే దేవి-నిఖిలాశుభనిచయ,
ములను దా నేలెడు-పుడమినుండి।

గీ. అట్టిసీతో విజయలక్ష్మ-మాంబసకల।
సుగుణనికురుంబవాక్త్రిస-మ్భకకదంబ।
యాస్యజితచన్ద్రబింబద-యాపలంబ।
యతనిపట్టపురాణి ప్ర-త్యక్ష వాణి॥ ౪౦॥

క. ఆ దేవికిమున్ను భవా।
నీదేవికిషణ్ముఖుఁడుజ-నించినమాడ్కిన్।
గాదిలికొమరుఁడుకలిగెఁబ్ర।
మోదావహుఁడగుభుజంగ-భూవిభుఁడెలమిన్॥ ౪౧॥

సీ. బీదసాదలు సేయు-విజ్ఞాపనంబులు,
బింకమింతయు లేక-వినెడువాఁడు।
వినిపరామరిక చో-ప్పున వారి వారిలో,
మంచిసెబ్బరలనుగు-ర్తించువాఁడు।
గుర్తించిధర్మపు-గురితప్పకురువమై,
యొసఁగుతీర్పులుఁదా-నొసఁగువాఁడు।
నొసఁగితానొసఁగిన-పసమీఱున్యాయముల్,
నడుపఁగాసంతోష-పడెడువాఁడు।

గీ. నిజమునకుత్రాణనలువరా-ణికికి కాణ।
విదుపురకుఁడెంకెల్బుబుధ-విబుమువంకి।

కరుణకుబిడారు మేల్ రాచ-సిరిగుడారు।
తారుసరదారుఁడాజమీం-దారుఁడరయ॥ ౪౨॥

సీ. పల్లంబుపై నెక్కి-వాఁగె వట్టెఁ జాలు,
గోడలు మేడలు-గుప్పళించు।
జాళెంబు గొలిపిడు-వాళించివదలినఁ,
చేటలుఁ గోటలు-పెకల్చు దూఁకు।
మఱిఁగరాళించిహయ-మాయించివిడిచినఁ,
దరువులుఁ జెరువులు-దౌడు వాఱుఁ।
గళ్ళెంబు సడలించి-కావాతరటుగొల్ప,
గుండులుఁ గొండలుఁ-గూలదాఁటు।

గీ. నౌరయాస్కందితము వార-ధౌరితమ్ము।
యారెప్లుతమారరేచిత-మహహా వల్గి।
తమ్మనుచుఁదోడుదొగలుచి-త్రమునఁజూతు।
రతనిజహయరాణబహుధాటి-కరిదిసాటి॥ ౪౩॥

సీ. రాజౌటనిజమయ్యు-రక్తి కాశింపఁడు,
కందులేదెచటఁజ-క్రియులఁబ్రోచు।
నరసింహుఁడే కాని-పరుసముల్ పలుకఁడు,
శాంతియొప్పెడుఁబుణ్య-జనుల నేలు।
ఘనుఁడు వాస్తవమయ్యు-గర్జించిమినుముట్టఁ,
డప్పులు లేవు రా-యంచ లెనయు।
నిసుఁడంటసత్యంబు-హృదయభేదముసున్న,
స్థైర్యమెక్కుడు చల్ల-దనము నొమ్ము।

గీ. తానుభోగిందుఁడగుట తథ్యంబె కాని।
క్రిందఁగార్లఁడు నాలుకల్-రెండు లేవు।

నోటనమృతంబుచిలుకఁగ-నుంగొనంగఁ।
జిత్రివూభుజంగరాయచ-రిత్రగరిమ॥ ౪౪॥

సీ. చూచెనాసరసార్థ-సూచనాయతిమృగీ,
లోచనాహృదయముల్-దొలఁచిచూచుఁ।
జూచెనాకనకాభి-షేచనాయతదృష్టి,
యాచనాగతులనిం-పారఁజూచుఁ।
జూచెనాక్రూరాగ్ని-లోచనాహుతిఁబరా,
లోచనాహతముగా-నేచిచుంచుఁ।
జూచెనాభవబంధ-మోచనానూనవి,
వేచనాశక్తిఁగా-న్పించిచూచు।

గీ. చూపులననిన్ని చూపులు-సూడనేర్చు।
పేరునకువేయికన్నుల-వేల్పుకాక।
యిట్టిమహిమలునతనియం-దేడఁగలుగు।
నింద్రుఁడెట్లీడుభుజగమ-హీంద్రమణికి॥ ౪౫॥

గీ. అతనియర్ధాంగలక్ష్మిచి-న్నమ్మరావు।
నెమ్మదికితావుశుభముల-న్నిఁటికిఁబ్రోవు।
కొలమునకువన్నెభర్తకు-వలపుకన్నె।
సుగుణసంపన్నతథ్యమా-మగువమిన్న॥ ౪౬॥

గీ. పుట్టెఁగస్తూరివంశాబ్ధి-పొంగమెట్టె।
మంత్రిపెగ్గడకులాబ్జంబు-మాన్యతఁగన।
నిట్టిచిన్నమ్మరావుఁగ-న్నట్టిశ్రీన్నృ।
సింహరాయునిపున్నెంబుఁ-జెప్పఁదరమె॥ ౪౭॥

సీ. తనదుపతివ్రతా-ధర్మ్మునకువిని,
ర్మలమైనవదనమం-డలమెసాక్షి।

తనమనోవైశాల్య-మునకుఁదొగల్ నవ్వ,
చెవులసోఁకెడుకన్నుఁ-గవయెసాక్షి।
తనదుమేలైనని-దానమ్మునకుమత్త,
నాగేంద్రమందయా-నంబసాక్షి।
తనమహాత్మ్యప్రవ-ర్తనమునకుఁబదియా,
ఱువన్నెపుత్తడిమేని-వన్నెసాక్షి।

గీ. తనయుదారదయారస-మునకుమంచి।
పంచదారలువెట్టించు-పలుకెసాక్షి।
కాఁగచిన్నమ్మరావుసా-ధ్వివాని।
కెనయుచుఁగనొప్పునిజనాథు-మనమెఱింగి॥ ౨౩॥

సీ. అలరించునిజమనో-హరలీలలింపార,
హృదయమామనితల-యెత్తువేళ।
నింకించునడుగంట-నెల్లసంకటములు,
కడువడినినిదాఘ-మడరువేళ।
మొలకలెత్తించునా-మూలాగ్రముగఁగోర్కె,
లెల్లప్రావృట్టురం-జిల్లువేళ।
నకలంకముగఁజేయు-నానందమొసఁగుచు,
మొగముశరద్వ్యాప్తి-నెగడువేళ।

గీ. నెలమినుప్పొంగఁజేయును-ద్వృత్తినధిపు।
నంగముహిమానిపొలుపుచె-లంగువేళ।
జలజలనరాల్చుభువివింత-చెలఁగునటుల।
జడిమములనెల్లశిశిరమె-సంగువేళ॥ ౨౪॥

శా. ఏవంభూతమనోనురాగమున నా-త్మేశుఁడామహానందసా।
రావారంబునఁదేల్చునగ్గరితమా-ర్కండేయకారుణ్యవీ।

క్షావైశేష్యమునందనూజుఁగనెదు-గాఁ బద్మనాభాఖ్యుఁడే।
జ్ఞోవిద్యాదికసర్వలక్షణవిశి-ష్టున్ శిష్టమోదావహున్॥ ౫౦॥

సీ. పసిఁడివన్నెలవాఁడు-పగడాలజగడాల,
జగడాలమోవికెం-జాయవాఁడు।
వెడదయెడదవాఁడు-వెలలేనిచలికాని,
సిరినేనినగుమోము-చెన్నువాఁడు।
నందమ్ముగలవాఁడు-నరవిందములఁజిందఁ,
దగుపొందికైననే-త్రములవాఁడు।
ముద్దుగులెక్కోడివాఁడు-పువువింటిదొరవంటి,
యొజపంటికంటికిం-బొసఁగువాఁడు।

గీ. కరికరములట్టికరములు-గల్గువాఁడు।
కనికరపురూపుఁజూపులఁ-గల్గువాఁడు।
నిహపరములెల్లనొక్కటఁ-నిచ్చువాఁడు।
పద్మనాభకుమారుఁడి-ప్పాటివాఁడు॥ ౫౧॥

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణగణసం।
భావితపుత్రోదయోత్స-వపరమవేశా।
వ్యావృతబంధుసుహృద్భా।
దేవాశీర్వచనరచన-తృప్తాత్మునకున్॥ ౧॥

క. వర్ణితసకలపురాణా।
కర్ణనకైదంయుగీన-కర్ణునకునిజో।
దీర్ణయశఃపూర్ణత్రీ।
రార్ణవనోకాయమాన-జ్యాభ్యర్ణునకున్॥ ౨॥

క. రంజితఫాలాక్షునకున్।
భంజితపరిపంథిభూమి-పతిపక్షునకున్।
మంజులశరీరరేఖా।
కంజాక్షునకసమరణజ-గచ్ఛాక్షునకున్॥ 3॥

క: అండజవాహనబంధుర।
మండితహృత్పుండరీక-మహితునకుధరా।
ఖండలునకుద్విజఫణిరా।
ట్కుండలునకురూపకుసుమ-కోదండునకున్॥ ౪।

క. శ్రీమంత్రిప్రెగడాన్వయ।
సోమునకున్ సీతమాంబ-సుతునకువెల్లా
భూమీశ్వరునకుఁగవితా।
ధామునకున్ శ్రీభుజంగ-ధాత్రీశునకున్॥ ౫॥

వ. పుత్రపౌత్రాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి యగునట్లంకితంబుగ నే నాంధ్రీకరింపం బూనిన శ్రీపరాశర మహర్షికృత ధర్మశాస్త్రంబునకుఁ బ్రారంభం బెట్లనిన.



శ్రీ

# ఆంధ్రపరాశరస్మృతి.

## ఆచారకాండము.

—:o:—

మ. హిమవంతంబున దేవదారువనమం-దేకాగ్రధీయుక్తి వ్యా।
సమహర్షిప్రవరుండు గ్రాలఁగ మునుల్-శ్రద్ధాత్ములై వచ్చి య।
య్యా! మహాత్మా! కలికాలయోగ్యమగు శౌ-చాచారముల్ మాకుఁ దె।
ల్పి మమున్ ధన్యులఁ జేయ వేయనికడున్-వేడంగ నాతండనున్॥

గీ. సర్వతత్త్వజ్ఞుఁడను గాను-సదయులార।
ధర్మములు బోధఁ జేయ నా-తరము కాదు।
కలఁడు మాతాత సర్వమ్ముఁ-దెలియువాఁడు।
ప్రాజ్ఞజనసమానుఁడతఁడు ప-రాశరుండు॥ ౨॥

గీ. రండు పోవుద మమ్మహా-త్ముండు మనకు।
విపులముగ నెల్లధర్మముల్-విశదపఱచు।
నంచు వారెల్లఁ దోడరా-వ్యాసమౌని।
కదలి పైనమ్ము సేసి యొ-కానొకయెడ॥ ౩॥

క. కరవీరలుంగదాడిమ।
మరువక పున్నాగ నాగ-మాధవలవలీ।

సరళవకుళపనసాదిక।
తరుషండము లెల్లనల్లి-తతరుచికరమై॥ ౪॥

క. శ్రీకరమై సులలితశో।
భాకరమై ఫలవితాన-పరికరమై పు।
ణ్యాకరమై యతిసాధుమృ।
గాకరమై సతతమాధ-వాకరమగుచున్॥ ౫॥

క. శుకపికశారీసారస।
బకహంసకదంబక్రౌంచ-పారావతలా।
వకఖంజరీటటిట్టిభ।
క్రకరవికిరనికరకంఠ-కలరవయుతమై॥ ౬॥

క. హారమై బంభరజృంభణ।
భరమై పరిమళసమీర-పరమై చేతో।
హరమై సురుచిరసలిలా।
కరమై యానందబృంద-కరమై యచ్చోన్॥ ౭

క. చెన్నొందుబదరికావనిఁ।
గన్నులక అవారఁగాంచి-కాంచనగర్భుం।
గన్నడ సేయు ముఖుషి సభ।
నున్న పరాశరునిఁ జూచి-యొగిమ్రొక్కుటయున్॥ ౮

ఉ. అమ్మహనీయుఁడాత్మసుతు-నక్కునఁ జేర్చి సమస్తమానిసం।
ఘమ్ముఁ గృపాకటాక్షమునఁ-గాంచి సమంచితరీతి క్షేమలా।
భమ్ము నపృచ్ఛ సేసి తరు-వాత ను వారలు వచ్చినట్టి కా।
ర్యమ్మడుగన్ నిరంతరపు-రాణనివాసుఁడు వ్యాసుఁడిట్లనున్॥ ౯

శా. తాతా యిక్కలియందు మానవులకున్-ధర్మ్ములే ముండుమీ।
చేతన్ విందుమటంచు వచ్చితిమి దా-క్షిణ్యంబు దైవారమా।

చేతఃప్రీతియొనర్చి పంపగదవే-శిష్టాగ్రణీమమ్ముఁ, శ్రీ
ధ్ధాతాత్పర్య పరీతచిత్తులఁగృపన్-ధన్యాత్ములం జేయవే॥ ౧౦॥

సీ. మనువుశనసుఁడత్రి-యునువిష్ణువాంగిర,
సుండునుశాతాత-పుండుయాజ్ఞ।
వల్కుఁడుగార్గ్యుఁడా-పస్తంబుఁడును లిఖి,
తుండుశంఖుఁడువసి-ష్ఠుండుగౌత।
ముండుకాశ్యపుఁడుద-క్షుండుప్రచేతుండు,
హారీతమునియుఁగా-త్యాయనుండు।
సంవర్తుఁడునువీరు-సలిపినస్మృతులన్ని,
మున్నువిన్నాఁడసం-పూర్ణముగను।

గీ. కృతయుగంబునకునుఁ త్రేత-కింక ద్వాప।
రమునకుభవద్విరచితధ-ర్మములుఁగూడ।
మీవలనఁదెలిసికొంటిని-మిగిలినట్టి।
కలియుగాచారములు సెప్ప-వలయుఁదండ్రి॥ ౧౧॥

గీ. ధర్మములుస్థూలసూక్ష్మభే-దములచేత।
రెండుతరగతులుండిరు-రెండువర్ణ।
ములకుఁగావుననవి లెస్సఁ-దెలిపిమమ్ము।
వేగఁగృతకృత్యులనుఁజేసి-వీడ్కొలుపుడు॥ ౧౨॥

చ. అనుఁడుఁబరాశరుండు-పర-హాసము మోముగఁజెంగలింపన।
మ్మునిసముదాయముం గని య-పూర్వకృపారసమొల్క-వారికి।
ట్లను ఋషివర్యులార భవ-దర్థముగోచరమయ్యె మీకు నే।
వినిచెదధర్మమర్మములు-పీనులపండువుగావినండుగన్॥ ౧౩॥

క. అవధార్యశ్రుతిస్మృతులకు।
భువినిర్ణేతలగుశంభు-వువిధాతయుఁపి।

ష్ణువువీరు సహజముగ సం।
భవమందుచుఁ జచ్చుచుండ్రు - ప్రతికల్పమునన్॥ ౧౪॥

చ. ప్రతియుగమందు నీశ్వరుఁడు - బ్రహ్మయు విష్ణువు వీరలా శ్రుతి।
స్మృతులను నిర్ణయింత్రు శ్రుతి - సృష్టికిఁ గర్తలు లేరు భారతీ।
పతి నిగమమ్ములన్నిని కృ - పన్వినుపించిన వానిఁ గొంచుస।
మ్మతి స్మరియించుచున్ స్మృతులొ - నర్తురిధరన్మనుముఖ్యధీమతుల్॥

గీ. కృతయుగమునందుఁ దపము ను - త్రేతయందు।
జ్ఞానము ను ద్వాపరంబునఁ - గ్రతుచయంబుఁ।
గలిని దానంబు ముఖ్యంబు - గానధర్మ।
వితతియు యుగానుసారంబు - వెలయుచుండు॥ ౧౫॥

సీ. మానవస్మృతి గౌత - మస్మృతి శంఖుని,
స్మృతియుఁ బరాశర - స్మృతియు వరుసఁ।
గృతయుగమందును - త్రేతయందును ద్వాప,
రమ్మునఁ గలియందుఁ - బ్రబలుచుండుఁ।
బతితుని దేశంబుఁ - గృతయుగంబున, వాని,
గ్రామంబుఁ ద్రేతాయు - గమున, వాని।
కులము ద్వాపరమునఁ, - గలియందు వాని నే,
వదలఁగావలయు న - ప్పతితుతోడ।

గీ. నింతమాట్లాడఁ బాపియౌఁ - గృతయుగమునఁ।
దాకినను దోషియగును త్రే - తాయుగమున।
వానితోఁ దిన్నఁ దురితుఁడౌ - ద్వాపరమునఁ।
దానొనర్చిన నరుఁడు పా - తకుఁడు కలిని॥ ౧౬॥

సీ. కృతయుగమున శాప - మిడిన నానిమిషమ్ము,
ననె తాఁకుఁ ద్రేతయై - నను దినాలు।

పదివట్టునదియెద్వా-పరమైన నెలగడు,
ప, దికలియైనహా-యనమువట్టుఁ।
కృతయుగమందుఁదా-మేగిదానమ్మీగి,
త్రేతరావించిగృ-హీతకిచ్చు।
...డుగఁగాలేదన-కిడుటద్వాపరమందు,
సేవఁగైకొనిదాని-కీవికలిని।

గీ. దాతతానేగిభక్తిగృ-హీతకిచ్చు।
టుత్తమము వానిరావించి-యొసఁగుదాన।
మదియమధ్యమమధమంబు-యాచకునకు।
నీఁగిమఱిసేవకునకీవి-యేవిఫలము॥ ౧౮॥

శా. రాజుల్ దొంగలచేతధర్మములధ-ర్మావాప్తిచేతన్నరుల్।
రాజీవాక్షులచేనసత్యములచే-భ్రాజన్మహాసత్యముల్।
దేజమ్ముల్ చెడునగ్నిహోత్రములుశాం-తిల్లుంగడుందీర్ఘస।
త్పూజల్ గిట్టునుకన్యకావితతికా-న్వాల్గాంచునీదుష్కలిన్॥ ౧౯॥

గీ. ప్రతియుగమ్మునకుఁదగుధ-ర్మములుననుస।
రించినడతురుద్విజులువా-రినిఁగురించి।
నిందసల్పఁగరాదువ-ణిజాతయుగస్వ।
రూపులైవాంద్రునుంటని-రూఢిపుడిమి॥ ౨౦॥

గీ. ఎముకలనుబట్టిపిదపమాం-సమునుబట్టి।
రక్తమునుబట్టియన్నగా-రవముఁబట్టి।
ప్రాణచయమలఁతులైయుగ-క్రమముమెఱయఁ।
జనుటయివియెల్లధర్మసై-సర్గికములు॥ ౨౧॥

శా. న్యాయాన్యాయనిరూపకస్మృతులుసం-ఖ్యాతీతముల్ గాబుధు
ల్గావ్యయంగానవియెల్లఁగాంచికడుఁగ-ర్తవ్యంబుగాఁదోఁచినం।

ప్రాయశ్చిత్తములన్విధించితినిశా-స్త్రప్రజ్ఞదీపింపమీ।
కాయాధర్మములిప్డుజెప్పెదవినుం-డా సావధానంబుగన్॥ ౨౨॥

గీ. ఇమ్మహీనిధర్మసంస్థాప-నమ్ముకొఱకు।
బ్రాహ్మణార్థమ్ముగాఁగఁబ-రాశరషిఁ।
విరచితమతమ్ముకల్బిష-హరముమఱియు।
నమలపుణ్యప్రదంబుశ్రే-యస్కరంబు॥ ౨౩॥

గీ. జాతులకునాల్గిఁటికిసదా-చారవృత్తి।
ధర్మములఁబ్రోచుచుండున-ద్దానివిడిచి
ధరఁజరించెడువారెట్టి-ధర్మములను।
జేసినఫలమేమియుఁ-జెందలేరు।
నిష్ఫలంబయియవియెల్ల-నీటఁగలియు॥ ౨౪॥

గీ. అనుదినమునాఱుకర్మము-లాచరించి।
దేవతాతిథిపూజలు-దీర్చివ్రేల్చి।
మిగులువడునన్నమెవ్వండు-మెసవుచుండు।
నట్టిశుచిమతిబ్రాహ్మణుఁ-డనఁగఁబరఁగు॥ ౨౫॥

గీ. స్నానయుతసంధ్యగాయత్రి-జపముహోమ।
మతిథిసంతర్పణంబుదే-వార్చనంబు।
వైశ్వదేవంబుననాఱు-వశ్యమైన।
నిత్యకర్మములగ్రజు-నికినెసంగు॥ ౨౬॥

గీ. ప్రీతిఁగలవాఁడునొండెయ-ప్రియుఁడునొండె।
గొప్పచదువరియొండెమూ-ర్ఖుండునొండె।
వైశ్వదేవాంతమునవచ్చు-వాఁడెయతిథి।
యతనిసంతర్పణంబుస్వ-ర్గాస్పదంబు॥ ౨౭॥

గీ. నిడుదపైనమ్ముగావించి-యొడలుబడల।
డస్సిబలిమైనయాకలి-డప్పిఁగొనుచు।
నదనునకువచ్చునట్టివాఁ-డతిథిగాని।
యటకుమునువచ్చునట్టివాఁ-డతిథికాడు॥ ౨౭॥

గీ. కొన్ని సందర్భములఁదప్ప-నన్ని యెడల।
నచటికాయూరనుండువాఁ-డతిథికాడు।
ప్రతిదినముగాకయెన్నఁడో-వచ్చినందు।
వలననతిథియనంగఁజే-ర్వడుటఁజేసి॥ ౨౮॥

చ. అడకువపెంపునంగుశల-మారసిచల్లనినీటఁగాళులం।
గడిగిసుఖాసనంబొసఁగి-కమ్మనిమాటలసేదదీర్చుచుం।
గుడుపుదరంబునిండనిడి-కొంచెముదూరముసాఁగనంపియా।
వడువుననింటికాఁపతిథి-వచ్చిననాతనినోముటొప్పగున్॥ 3౦॥

క. వెలితివడియతిథివెలువడు।
నిలుపెతరులువిడుతురుపది-యేనేండ్లెంతే।
వెలపొడువుహోమమైనను।
ఫలమేమియులేకనేల-పాలగునచటన్॥ 3౧॥

గీ. సారమగునేలనిడినబీ-జంబుపగిది।
గట్టిపనఁటినిఁదాచుపై-కంబుకరణి।
మంచివారికిఁదగునీఁగి-మరలఁదనకుఁ।
బనికిఁబగుఁగానియడఁగదె-ప్పటికినైన॥ 3౨॥

గీ. పుట్టుపురుడులునడుగక-వట్టిచదువు।
సంధ్యలుపరీక్షసేయక-సమయమునను।
వచ్చునతిథియెయాపర-బ్రహ్మమనుచు।
మదినిభావించియతనినో-మంగవలయు॥ 33॥

గీ. నియతిఁదప్పనియతి వేద-నియతినడచు।
వడుగు, నతిథియుఁ, బూజ్యులు-ప్రతిదినంబు।
సరగయతియొండెమఱిబ్రహ్మ-చారియొండె।
వైశ్వదేవంబునకుముందు-వచ్చిరేని॥ ౩౪॥

గీ. వైశ్వదేవమ్మునకుఁదగు-భాగముంచి।
వేగవారికిబిచ్చంబు-వెట్టవలయు।
బీదయింటికిఁబెక్కండ్రు-బిచ్చగాండ్రు।
వచ్చునెడనందుముగురకీ-వలయుభిక్ష॥ ౩౫॥

ఆ. వలనుకొలఁదినిట్లు-వటువునకునుయతి।
కివ్వవలయుబీద-లెల్లమఱియుఁ।
గలిగియున్నయెడలఁ-బలువురేతెంచిన।
వారినెల్లఁదృప్తి-పఱుపవలయు॥ ౩౬॥

ఆ. యతికిమొదటనీళు-లందిచ్చియన్నంబుఁ।
బెట్టియింతనీరు-పట్టిరేని।
నట్టులిడినయన్న-మామేరువునకైన।
యాజలంబుజడధి-కైనహెచ్చు॥ ౩౭॥

గీ. గొడుగుగోడిగయేనికఁ-గొనుచుదిరిప।
మెత్తఁగావచ్చుభూపతి-కేనినతని।
కులముగోత్రమ్ములడుగక-కుడుపొసంగ।
వలయునదిభోగదేవేంద్ర-పదవినొసఁగు॥ ౩౮॥

గీ. వైశ్వదేవమ్ముచేయని-పాపమెల్ల।
వడుగునకుఁబెట్టుకుడుపుచే-నడఁగుఁగాని।
వటువునకుఁబెట్టకుండుపా-పమ్ముచూడ।
వైశ్వదేవమ్ముచేయుట-వలనఁబోదు॥ ౩౯॥

గీ. వైశ్వదేవముడిగి కాని - వైశ్వదేవ।
ముడుగు వానింటఁ గాని, సా - పడు ద్విజుండు।
కాకజన్మంబుఁ బొరయుఁ జే - కాకస్వకృత।
పుణ్యములు వాసి యమలోక - మునకు నరుగు॥ ౮౦॥

గీ. పితృమహాఘాతకుండైన - విప్రహంత।
యైనఁ జండాలుఁ డైనఁ బా - పాత్ముఁ డైన।
వైశ్వదేవాంతమున వచ్చు - వాని స్వర్గ।
దాయి యగు నతిథిఁ గఁదల - పోయవలయు॥ ౮౧॥

క. వడిఁ బాగతోడఁ గానీ।
చెడు దక్కిన దెసకు మొగము - సేసియుఁ గానీ।
యెడమ చరణమున హస్తము।
నిడి కానీ కుడువఁ గూడ - దిది యాసురమా॥ ౮౨॥

## రాజధర్మము.



సీ. వ్రతములు దొలఁగంగ - వైచి, వేదములను,
జదువుట మాని బి - చ్చమునఁ బొట్ట।
గడిపెడు వడుగులు - గలిగి తెక్కలి కాండ్రి,
కించు నూళ్లెల్ల, శి - క్షించి రాజు।
పైఁబడి వచ్చు తెం - పరుల గుపగతురఁ,
జేఁ గైదువుల కెరఁ - జేసి వైచి।
సుజనులఁ బ్రోచుచుఁ - గుజనులఁ నేచుచుఁ,
బాడితోఁ బుడమిఁ గా - పాడవలయు।
ఆ. మ్రాను నొవ్వకుండ - మంచిపూవులు గోయు।
వాని యోజ నుండ - వలయుఁ గాని।

బొగ్గులకుఁగ వేఱుఁ-బోడు మటమన్నీల।
కురువు కాదుదాని-నుడుగుటొప్పు॥ ౪౩॥

## వైశ్యధర్మము.



ఆ. వడ్డిబేహారంబు,-వాణిజ్యమును, రత।
నాలనమ్మటయును,-నాల పెంపు।
నేలదున్నటివియ-నిందితధర్మమ్ము।
లార్యనీతమందు-రర్యతతికి॥ ౪౪॥

## శూద్రధర్మము.

—:o:—

గీ. పాలుబలనుగొలిచియుంటయే-పరమధర్మ।
మండ్రు నాలవజాతిక-ల్లదియుపేక్షఁ।
జేసియెన్నేనిఁగర్మముల్-సేసిరేని।
వారలకుదానమెంతయు-ఫలములేదు॥ ౪౫॥

ఆ. తేనెపాలుపెరుగు-నూనెమజ్జిగయుప్పు।
వీనిశూద్రజాతి-విక్రయింప।
వచ్చు దూష్యమనుచు-వానిదూఱకమీఁది।
మూఁడుకొలములందు-వాడఁదగును॥ ౪౬॥

ప్రథమాధ్యాయము సంపూర్ణము.



## ద్వితీయాధ్యాయము.

సీ. కలియుగమునందు సేద్యంబు-నలుకోలముల।
భవనభర్తలకొప్పిన-పాడియగుట।
యెదియొనర్చుకర్మంబిప్డు-సాంతముగను।
విని చెడఁబరాశరునిమత-మనుసరించి॥ ౪౭॥

క. కలుమారిసములమ్ముట, తిన।
వలదనునవితినుట, వావి-వదలుట, ద్విజకాం।
తలరతి, శ్రుత్యగమనము, కపి
లలక్షీరముగొంటు, కాఁపు-లకునరకదముల్॥ ౪౮॥

## బ్రాహ్మణధర్మములు.

సీ. షట్కర్మనిరతుఁడా-చారవంతుఁడునగు,
బ్రాహ్మణుఁడాత్మజీ-వనముకొఱకు।
సేలదున్నుటయున-నిందితధర్మమై,
చెలఁగును, కాని, క-షీణించునాతఁ।
డాకొన్నదైన, హీ-నాంగముకలదైన,
దూఁపగొన్నదియైన,-నోపకుండు।
నదియైన, బలుడస్సి-నదియైనఁ, దెవులుగొ,
న్నదియైన, మగతన-మరినదైనఁ।

గీ. గాకదృఢతనువయి తెస్సఁ-గడుపునిండి।
నట్టివృషభమునలకను-గట్టిసగము।
దినముద్దనుకనుపనిసేసి-తెగినపిదప।
నొవలుగడిగిస్వకర్మముల్-నడపిపిదప॥ ౪౯॥

గీ. జపము సాఁగించి దేవతా-ర్చన నొనర్చి।
యగ్ని కార్యమ్ము నెరవేర్చి-యాగమంబు।
చదివి యామీఁద నన్నంబు-స్నాతకులకు।
విప్రులకుఁ బెట్టవలయు నో-పిన కొలంది॥ ౫౦॥

గీ. కరిసెనము చేత మఱియును-గడన చేత।
నగ్రిజుఁడు నిల్వ సేయు ధా-న్యంబు పంచ।
యజ్ఞములకును విలువైన-యాగములకుఁ।
దలఁచి వినియోగమును చేయ-వలయు నెందు॥ ౫౧॥

గీ. బ్రాహ్మణులు నేయి మొదలైన-వానిరసప।
దార్థములు నూవులమ్మఁగఁ-దగదు వలయు।
నేని గింజలబదులుగా-నియ్యవచ్చు।
ననుచితముగ డ్డికట్టల-నమ్మిరేని॥ ౫౨॥

గీ. పాఱులకు దున్నుట మహా-పాపవృత్తి।
తెలిసి తెలియక యినుఁప నాఁ-గలికిఁ దగిలి।
చచ్చు జంతువు లొక్కవ-త్సరము లోన।
బెస్తవానికిఁ దగినంత-పీడఁ దెచ్చు॥ ౫౩॥

ఆ. బెస్త, బోయ, కటిక-పిసినారి, యెఱుకయు।
దురితమున నుసములు-కరిసెనమునఁ।
జెట్టుఁగొట్టి నేలఁ-జీల్చి పుర్వులు సంపు।
నఘము మాయును ¶ఖల-యజ్ఞమునకు॥ ౫౪॥

గీ. ఎంతఁగాపైనఁ గానిమ-హీసురునకు।
రాసిలో వచ్చు పాలు పే-రాసఁ జేసి।
పెట్టకుండినవానిఁ బా-పిష్టియనియు।
దొంగయనియును గనితొలఁ-గంగ వలయు॥ ౫౫॥

¶ ఖలయజ్ఞము=కళ్ళమునందు ధాన్యముదానము సేయుట.

క. దొరకాతిఁటనొకటిధరా।
మరునక్షముప్పదిఁటనొకటి-మతి దేవునికి।
ట్లిరువదొకటనొకటియునీ।
వరుసకాబాల్యయవలెన-వరజుఁడుపంటగా॥ ౫౬॥

గీ. పర్వపతులుఁగూడఁబైరుపం-టలను జేసి।
దేవతాబ్రాహ్మణులపూజఁ-దీర్పవలయుఁ।
గోమట్లులుశూద్రులునుగూడఁ-గోరికృషియుఁ।
జెక్కడము చేహరంబునుఁ-జేయుటొప్పు॥ ౫౭॥

గీ. ద్విజులకొలువులుమానివి-విధములయిన।
పనులు చేసెడుశూద్రుల-వయసుతఱుఁగు।
ననుచుఁజెప్పినయివినా-తనపుధర్మ।
మర్మములు నాల్గుకొలముల-మానవులకు॥ ౫౮॥

ద్వితీయాధ్యాయము సమాప్తము.

## తృతీయాధ్యాయము.

:(o):

సీ. ఇఁకఁబురుదులకుమ-యిలలకుశుచివచ్చి,
యింపఁగలనువినుఁ-డెట్టులన్న।
దినములుమూడువి-ప్రునకుఁబంద్రెండురా,
జునకుఁబదేనుబ-చ్చునకుఁగాపు।
జాతికినొకనెల-ప్రేతసూతకమునని,
క్రమమువిధించెఁబ-రాశరుండు।
వెండియ్యుపాసనా-విధిసేయుతఱిమాత్ర,
మగ్రజునికిమైల-లంటవెపుడు॥

ఆ. పుట్టుపురుడులకును-ముట్టువోసము లేదు।
పదియుఁబదియు రెండుఁ-బదియునైదు।
దినములగ్రజునక-ధపునకుఁ బేరికిఁ।
గాపునకొక నెలయుఁ-గలుఁగుఁబురుడు॥ ౫౯॥

చ. ఒకదినమందుశుద్ధుఁడగు-హోమమొనర్చెడువైదికుండువై।
దికుఁడయినంతమాత్రనవి-ధేయముమూఁడుదినమ్ములట్లువై।
దికుఁడునుగాకయగ్ని విధి-దీర్చుటయొండెనులేక నామమా।
త్రకుఁడగుపాఱువానికివి-ధాయకమౌపది నాళ్లుశుద్ధికిన్॥ ౬౦॥

ఉ. ఎక్కువజాతివాఁడతను-తృష్ణకుఁదాళఁగలేకయొక్కతెన్।
దక్కువదానిఁజేకొనిన-దానికిఁబుట్టినబిడ్డలయ్యకే।
ఫక్కినిగల్గునాకరణి-వారొనరింతురశౌచకంబులాం।
డొక్కపథంబువట్టుటది-యెప్పుడువారలకట్టిపోటులన్॥ ౬౧॥

గీ. అట్టివారెల్లమైలల-ననుసరింప।
వలయుఁదప్పనిసరిమూఁడు-తలలుదాఁక।
యేనవయునాఅవయుమటి-యేడవయును।
తలలకెల్లనుఁబిండంబు-వలననసరి॥ ౬౨॥

గీ. నాల్గుతరములదనుకది-నములుపదియు।
నైదుజరిగిననాఱును-నాఱుగడువ।
నాల్గుమటియేడుదనుకది-నములుమూఁడు।
సలుపఁగావలెఁదప్పద-శౌచకములు॥ ౬౩॥

గీ. వలసిపైనుండిపడిచచ్చు-వాని, కగ్ని।
నుఱికిమృతిఁజెందువాని,కొం-డొకవిలాతి।
యందుగిట్టినవానికి,-యతికి,రింగ।
జొాకుమైలలులేవుస్నా-నమునఁదీరు॥ ౬౪॥

గీ. పండ్లిడనికూనకును జాతి-పడినపిండ।
మునకు సంస్కారములు లేవు-పొట్టఁజచ్చు।
బుడుతకును మాసములు లెక్క-యిడుచునన్ని।
దివసములు మైలతల్లియే-తీర్పవలయు॥ ౬౫॥

గీ. కడుపయిన నాల్గుమాసముల్-గడుచుదనుక।
స్రావమనియును నైదాఱు-జఱుగుదనుకఁ।
పాతమనియునుఁబిదపఁబ్ర-సూతియనియుఁ।
దెలిసిపదినాళ్లు పురుడుండ-వలయుఁదల్లి॥ ౬౬॥

గీ. పండ్లువచ్చిన్నరాకున్న-బాలకునకుఁ।
గూకటులువెట్టిరేనియా-కుఱ్ఱకగ్ని।
విధులొనర్పంగవలయుస-పిండికులకు।
మూఁడుదినముల శౌచక-మవసరము॥ ౬౭॥

గీ. స్నానమునఁదీరుదంతముల్-రానిసుఁగు।
కవ్వియేర్పడ్డనొక్క-నాఁడవల పుట్టు।
వెండ్రుకలుదీయమూన్నాళ్లు-పిదపవడుగు।
చేసినట్లైనపదినాళ్లు-సిద్ధమశుచి॥ ౬౮॥

గీ. మైలగలయింటివారిసం-పర్కమైనయ।
కున్నవారికి,వేలిమి-యున్నవారి।
కి, వటువునకెట్టిమైలలు-దవులవట్లు।
గానవారెల్లకర్మముల్-గడుపఁజనును॥ ౬౯॥

గీ. కలయికలచేతవిప్రుఁడ-గ్రాహ్యమైన।
మయిలలందుట, యట్టిసం-పర్కములను।
జేయకుండుటచేతశు-చియయియుంట,।
ధర్మనిర్ణీతకర్మముల్-గర్తలకు॥ ౭౦॥

గీ. కలయికలచేతదోసంబు-కలుగుచుండు।
నద్దివీక్షించినదురితము-లంటకుండుఁ।
గానవన్ని విధాలవి-జ్ఞానులైన।
వారలీసంకరములను-వదలుటొప్పు॥ ౭౫॥

గీ. పెండ్లియందునుజన్నంపు-వేళయందు।
దేవతోత్సవమందుని-ర్దిష్టమయిన।
ద్రవ్యమునకెట్టియశుచియు-రాదుగానఁ।
దలఁచినట్లదివెచ్చంబు-సలుపవచ్చు॥ ౭౬॥

గీ. పుట్టుచావులపదినాళ్ళ-ముసరులోన।
వేఱొకటివచ్చె[illegible]-భిన్నంచినట్టి।
రెండవదిమొదటుననంత-రించుచుండుఁ।
గానరెండునుఁజేయము-ఖ్యంబుకాదు॥ ౭౭॥

గీ. పాలుులనుగావఁజనియొండె-పసులకొఱఁకు।
నొండెఁజెఱఁబడ్డస్త్రీఁగావ-నొండెమతియు।
దురమునునొండెఁజచ్చిన-పురుషవరున।
కొకదినమశౌచముండుపె-క్కుండవెపుడు॥ ౭౮॥

ఆ. మొగ్గరమునఁబోరి-మగ్గినమొనగాఁడు।
నాసలడఁచియమలుఁ-డైనయోగి।
పుడమిలోనవీరు-పూషణబింబము।
గండిఁబొడువఁజాలు-దండివారు॥ ౭౯॥

చ. అనిమొనఁబెట్టుతాకిసిగ-మాడుచునెత్తినపెద్దకత్తిచే।
క్కినటులవీచుచున్నదుట-కేవలవీరరసంబుజేగురిం।
పనసమసంగరంబునల-వంతయువెన్కకుఁదొలికక్కకందుఁజ।
చ్చినజగజెట్టిసత్యముగఁ-జేరునుసిస్తులపుణ్యలోకముల్॥ ౮౦॥

గీ. బాసటఁగవచ్చినట్టియు-వ్వాజులెల్ల।
బ్రింగిబలుసేగిఁజిక్కి-వా-పోవువానిఁ।
గనికరము నేపునెక్కొనఁ-గావఁజనెడు।
మనుజుఁడతులక్రతుఫలంబు-లనుభవించు॥ ౭౧॥

క. గదలును బాణములుంగొని।
చిదుపలు గాఁగొట్టఁబడ్డ-జెట్టిమగనియొ।
ప్పిదమగు దేహము వేలుపు।
ముదితలువరియింతురిమిగుల-మోహాతురలై॥ ౭౨॥

క. నామగఁడు నామగండని।
వేమఱు నెదనొత్తికొనుచు-వేవురు సురనా
రీమణులమోఘతరసం
గ్రామాహతు నాచికొందురి-క్షణమాత్రములోన్॥ ౭౩॥

శా. ఏలోకంబతులక్రతూత్సవఫలా-నేకంబునంగల్గునో।
యేలోకంబునఁ బారమార్థికుఁడుయో-గీంద్రుండు తానుండునో।
యాలోకంబరచేతిదౌనరుఁడుమ-త్తారాతిసైన్యావళీ।
వ్యాలోలన్నిశితాశిహస్తుఁడయి వీ-రావేశతం గూలినన్॥ ౭౪॥

క. గెలిచినచో సిరి చేకురు।
గెలువక గెడసినను దేవ-కిసలోష్ఠలకాఁ।
గిలిచేకురు క్షణమునఁజను।
నోలు పెనకువఁజనుట కెంత-యునువగ పేలా॥ ౭౫॥

ఉ. మత్తుఁడువోలె మేనిచవి-మానినటించుచు నెమ్మొగంబునన్।
నెత్తురుచెమ్మరిల్లఁగన-నింజెరలాడెడు వీరుఁడింపుత।
శ్రొత్తనేకభూసురులు-గొల్వఁగ సోమముఁద్రావివెల్గున।
త్యుత్తమమైనయజ్ఞమున-హోతృవిధంబున నొప్పుచుండెడున్॥

సీ. వెనకముందర లేని-విప్రశవము మోయు,
ద్విజుఁ డడుగడుగుక-క్కజము మెరయఁ।
క్రతుఫల మొందుచే-కాక వానికి నెట్టి,
పీడలు రావుకి-ల్బిషము లేదు।
స్నానంబుఁ జేసినఁ-జాలు సూతకమను,
మాటయే లేదుము-మ్మాటకైన।
నందులో దాయాది-యైనఁ జుట్టంబైన.
లేనియా బ్రాహ్మణు-పీనుఁగెవ్వఁ।

గీ. డెత్తినను గాల్చిననునట్టి-యుత్తమునకు।
ఫలము లివియని చెప్ప[illegible]-నలవి కాదు।
మఱియు నతనికి నెప్పాటి-మైల లైన।
ముక్కుఁ బట్టినఁ దొలఁగియా-మూలకరుగు॥ ౨౭॥

గీ. పాలివాఁడైన నెప్పాటి-బంధువైనఁ।
గాని పీనుఁగు వెంబడిఁ-గదలి నడచు।
నతఁడు మరలిన పిదప నీ-ళ్ళాడి యగ్ని।
యించుక స్పృశించి నేయి ప్రా-శించవలయు॥ ౨౨॥

సీ. రాచపీనుఁగు తోడ-బ్రాహ్మణుండరిగిన,
నొకరోజు సూతక-ముండి పంచ।
గవ్యంబుఁ గొనవలె,-ఖట్టిక కోమటి,
దైన రెండు దినమ్ము-లట్టులుండి।
యామీఁద నాలు ప్రా-ణాయామములు చేయ,
వలె,నదిశూద్రుని-పాడెయయిన।
మూఁడు రాత్రుల శౌచ-మును బట్టి వారాశి,
గామియా నదిజల-కంబొనర్చ॥

గీ. మొనసి నూఱు ప్రాణాయామ-ములను జేసి।
ఘృతముఁ బ్రాశించవలె, వెండి-మృతులకుడక।
మిచ్చి శుచియైనపిమ్మట-నేగికాఁపు।
వారిఁ బాలులుగనుఁగొంట-పరమహితము॥ ౮౯

తృతీయాధ్యాయము సంపూర్ణము.

## ప్రాయశ్చిత్తకాండము.

### చతుర్థాధ్యాయము.

——:o:—

గీ. మానభంగము వలనఁ, గో-పాన, నెమ్మి।
వలనను, భయాన, నురి నాత్మ-వధకులౌఁగి।
నట్టి స్త్రీపురుషులకును-న్నట్టిగతులు।
నింక విధియింపఁబడును బ్ర-త్యేకముగను॥ ౯౦

గీ. ఎముకలకు నిక్కడోచ్చున-కిరవునల్ల।
కిమ్ముదోసఁగులకిల్లును-జిమ్మచీఁక।
టికిరి కాణంబు నరకమ-ట్టిగతి కరిగి।
నిలుతురాశ్వేలయేండ్లు పై-ఖలజనములు॥ ౯౧

గీ. వారి కగ్నిజలాదిసం-స్కారములును।
లేవు కన్నీరిడుటకూడ-లేద, శౌచ।
ములును లేవట్టివారిని-మోసియగ్ని।
యిడినచోఁ దప్తకృచ్ఛ్రంబు-నడపవలయు॥ ౯౨

సీ. ఆవులచేత బ్రా-హ్మణులచేతను మఱి,
యురిచేతఁ జచ్చిన-దురితశవము।

ముట్టినమోచినఁ-గట్టినఁగాల్చిన,
వెంటనేగినఁగాని-విప్రవరుఁడు।
తప్తకృచ్ఛ్రము సేసి-తదనంతరము బ్రాహ్మ,
ణులకుభోజనమిడి-వలనుకోలఁది।
దక్షిణలిచ్చిగో-దానంబువృషభస,
హితముగానొనరించి-రేనిశుద్ధు॥

ఆ. లగుదురదియుఁగాక-యట్టిపాపులతోడ।
నొక్కవత్సరమున-కెక్కుడుదివ।
సములుమన్నఁబాప-సంపర్కమునఁజేసి।
పతితులగుదురూర్ధ్వ[illegible]గతికిఁదప్పి॥ ౯౩॥

సీ. ప్రథమపక్షమునఁద్రి-రాత్రకృచ్ఛ్రముద్వితీ,
యమునఁగృచ్ఛ్రముఁదృతీ-యమునసాంత।
పనము నాల్గవపక్ష-మునఁబదియుపవాస,
ములునుఁబంచమపక్ష-మునఁబరాక।
మాఱవపక్షంబు-నందుఁజాంద్రాయణ
మొగిసప్తమమునఁద-ద్ద్యుగము నెనిమి।
దవపక్షమునఁబదు-నైదుప్రాజాపత్య;
ములు సేయవలెఁబతి-తులనుఁగలయు।

గీ. వారలిట్లొనరించియా-పైనస్వర్ణ।
దక్షిణలొసంగవలయును-పక్షసంఖ్య।
ననుసరించుచునివ్విధి-యాచరింప।
దుష్టసహవాసదోషంబు-దొలఁగిపోవు॥ ౯౪॥

సీ. ముట్టునీళ్లాడిన-ముదితభర్తను నాఁడు.
డాయదేనట్టిచం-డాలురాలు।

చచ్చినపిమ్మట-జన్మజన్మమునకు,
విధవయైనరకాన-వెతలఁజెందు।

నట్లనేనీళ్ళాడి-నట్టిపెండ్లముతోడ,
రమియింపనట్టిని-భార్గస్యఁడైన।

పతిభ్రూణహత్యచే-వచ్చుదుర్గతికేసు,
దీననెప్పాటిసం-దియములేదు॥

గీ. బీదయనిరోగియనితెల్వి-లేదనియును।
మూఢుఁడనియునునేముండ-మోపిమగనిఁ।
దెగడువదికుక్కయునుఁబంది-యగుచనేక
జన్మములనెత్తునియ్యిలా-స్థలినిజంబు॥ ౬౫॥

చ. పతితనకుండఁబెండ్లముప-వాసవ్రతంబులుసల్పుతేనినా।
వ్రతములుభర్తయాయువున-వశ్యముగ్రమింగుచునుండు
వెండియుం।

బతివచనంబుఁజేకొనక-పత్నివ్రతంబులుసేయునేనినా।
వ్రతములురాక్షసాధముల-పాలికినేగునమర్త్యహేయమై॥ ౬౬

క. బందుగులకుజ్ఞాతులకుఁ।
మందులుమాకులునుబెట్టు-మానినితోఁగ।
డ్వందిగఁద్రావుమగువతో।
నెందునుమాట్లాడఁగూడ-దిదిపాపంబో॥ ౬౭॥

గీ. బ్రహ్మహత్యకునిమ్మడి-పాపదోష।
మొందుఁదిగఁద్రాగునట్టియ-య్యువిదకాన।
దానివర్జించియుండుట-తక్కువేలు।
విరుగుడోదవదుభువినెందు-వెదకిచూడ॥ ౬౮॥

గీ. కర్మచండాలురగుచు స-ద్గతికిదూర।
మగుద్భురదనునిత్యకృ-త్యములుదీర్ప।
కగ్నికార్యంబులుడిగి య-హర్నిశంబు।
నతులధర్మపరాఙ్ముఖు-లైననరులు॥ ౯౯॥

చ. బెలమగుగాలివాగుల నె-పంబునఁజొచ్చినవిత్తుతావువా।
రలకు ఫలంబొసంగుగతి-అంకునఁబుట్టినబిడ్డలయ్యలం।
గలతురు వారిలోమగఁడు-గల్గఁగఁబుట్టినవానిఁగుండుఁడం।
డ్రలయతఁడేగఁగాఁగలుగు-నాతనిగోళకుఁడండ్రుధీయుతుల్॥

గీ. ఔరసుఁడుక్షేత్రజుఁడు దత్తుఁ-డనుచుఁ గృత్రి।
ముండనుచుఁ బుత్రులుండ్రు మ-గండుపత్నిఁ।
గన్నకొడుకౌరసుఁడు తన-కాంతయంది।
తరునకిలఁబుట్టువాఁడు క్షే-త్రజుఁడుమఱియు॥ ౧౦౧॥

క. అనపత్యుఁడగుచు జననీ।
జనకులలోనొకరు తనకొ-సఁగనందిన యా।
తనయుఁడు దత్తుఁడు మతిమం।
తుని సుతునిఁగఁగొన్నఁదత్తు-తుఁడు కృత్రిముఁడౌ॥ ౧౦౨॥

సీ. అన్నపెండ్లాడక-మున్ను దానాడిన,
నన్నయుఁ దమ్ముఁడు-కన్నె కన్య।
నిచ్చువాఁడునుఁ బురో-హితుఁడు పీరేగురు,
పతితులైనరకానఁ-బడుదురు మరి।
యును జంటకృచ్ఛ్రమ్ము-లొనరించి యన్నద,
మ్ములు కన్యయొక్క-టి-సలిపి దాత।
కృఛ్రాతికృచ్ఛ్రంబు-లెనసి చాంద్రాయణ,
మొనరించి పాలెపాం-పోషుమేది।

గీ. సుద్దియగుదుర వెండియుఁ-బెద్దవాఁడు।
పొట్టి పేడి జడుండునుఁ-బొఱడుఁ జెడ్డ।
గొంతువాఁడునుఁ జెవిటియుఁ-గ్రుడ్డి మూఁగ।
యైన వెనుకటివాఁడు పెం-డ్లాడవచ్చు॥ ౧౦౩॥

క. పిన్నబ్బలు పెద్దబ్బలు।
గన్నసుతుల్ సవతితల్లి-గన్నసుతుల్ చే।
కొన్నసుతులు పెద్దలు తా।
మున్ననుఁ జిన్నలకుఁ బెండ్లి-యొనరింపఁదగున్॥ ౧౦౪॥

గీ. చిన్నవాఁడన్నకన్నను-మున్ను శోభ।
నంబుచేసికొనఁడగద-న్న యొక వేళ।
సెలవొసంగినఁ దానుచే-సికొనవచ్చుఁ।
దప్పులేదని శంఖుండు-చెప్పెమున్న॥ ౧౦౫॥

క. పతి నష్టుఁడైనఁ జెడినను।
మృతుఁడైన యతీంద్రుఁడై జి-తేంద్రియుఁడైనన్।
క్షితిఁ బేడియైనచోటుల।
సతికొండొకమగనిఁ బెండ్లి-సలుపఁగవచ్చున్॥ ౧౦౬॥

గీ. పతిగతించినపిమ్మటఁ-బత్ని తాను।
బ్రహ్మచర్యాశ్రమంబునఁ-బరగనేని।
దేహధర్మమునొంది సం-దియములేక।
బ్రహ్మచారికిఁదగుగతిఁ-బడయఁజాలు॥ ౧౦౭॥

చ. కరమును పుట్టఁజొన్పి యుర-గంబహితుండికుఁడీడ్చుచాడ్పునన్।
విరహముతాళలేక తన-పెన్మిటితోఁ జనిపోవుసాధ్వి స।
త్వరమునఁ దన్మనోహరుని-పాపవిముక్తినిఁ జేసి పెక్కు-వ।
త్సరములు స్వర్గమందు సుఖ-సంపదలాతనితోడ నందెడున్॥

## ఆశ్వాసాంతము.

మ. అతులాచారవిశుద్ధమూర్తి దిగశేషాంతోజ్జ్వలత్కీర్తి పా।
లితవిద్వత్కులహంస బంధుజననాళీకావళీహంస యా।
శ్రితలోకామరభూరుహారిపుశిరగ్గి-ప్రేంఖత్పదాంభోరుహా।
శితికంఠార్పితలోల భూసురమణీ-శ్రీరాజచూడామణీ॥ ౧౦౯॥

క. సింధూగాంధారోద్భవ।
సైంధవరత్నోత్కరప్రచారణధిషణా।
బంధురయార్యాదరణ ధు।
రంధరకంధరవితరణ రాజత్సుకృతీ॥ ౧౧౦॥

మాలిని. మదననిభశుభాంగా-మాన్యమోదాంతరంగా।
కదనతలపతంగా-ఖప్రఖేలత్తురంగా।
సదమలగుణసంగా-శర్వపాదాబ్జభృంగా।
మదయుతరిపుభంగా-మంజువాచాతరంగా॥ ౧౧౧॥

గద్య. ఇది నిరుపమాన కరుణాసనాథ శ్రీసర్వమంగళానాథ
ప్రసాదాసాదిత సరసకవితావిహార రామలక్ష్మ్యంబా
బుచ్చివేంకయమంత్రీంద్ర కుమార శాండిల్య గోత్ర
పవిత్రాపస్తంబసూత్ర సుకవిజనవిధేయ ప్రభా
కరనామధేయప్రణీతంబయిన శ్రీమదాంధ్ర
పరాశరస్మృతియను ధర్మశాస్త్రంబునం
దాదిమబింబము సమాప్తము. శ్రీశ్రీశ్రీ.



శ్రీరస్తు.

శ్రీమార్కండేయేశ్వరాయనమః.

# ఆంధ్రపరాశరస్మృతి.

[ద్వితీయబింబము.]



మార్కండేయ కృపా।
ధామ దురితతిమిరతిగ్మ-ధామ కులసుధా।
ధామ గుణస్తోమ దయా।
భూమా శ్రీమద్భుజంగ-భూపలలామా॥

చతుర్థాధ్యాయము సంపూర్ణము.

## పంచమాధ్యాయము.

సీ. నక్కయుఁ దోఁడేలు-కుక్కయుఁగఱచిన,
స్నాతుఁడై విప్రుఁడు-పూతుఁడగుచుఁ।
బ్రామినుక్కలకుఁ దల్లి-యైమించు గాయత్రి,
జపియింపవలె వెండి-జాగిలంబు।
నగ్రజునంటిన-నాలకొమ్ములనీళ్ళ,
స్నానమొనర్చియై-నను మహాబ్ధి।
తోడమహానదుల్-గూడుపజ్జలఁజూచి,
యైన శుచీభూతుఁ-డగును మఱియు।

గీ. వేదవిద్యావ్రతుండగు-విప్రవరుఁడు।
స్నాతుఁడై కుక్క-కాటుఁ ది-న్న సమయమున।
నుడుగ కతఁడప్పుడే హిర-ణ్యోదకంబు।
చేత నీళ్ళాడి నేయిఁ బ్రా-శించవలయు॥ ౨॥

గీ. వ్రతమునందుండి వేపి కా-టు తినె నేని।
ద్విజుఁడు మూన్నాళ్ళు నిట్టుండి-పిదప నాలు।
గవదినమ్ము నేయి దర్భో-దకములు ద్రావి।
మిగిలిన వ్రతంబు నావెన్కఁ-దగు ముగింప॥ ౩॥

గీ. వ్రతములున్నను లేకున్న-బ్రాహ్మణుండు।
వేపి కఱచినతోడనే-విప్రవరుల।
పాదములకెఱఁగుచుఁ దత్కృ-పాకటాక్ష।
లక్షితుండైన దోషముల్-వానిఁ బాయు॥ ౪॥

సీ. కుక్క గోకిన మూరు-కొన్న నాకిన విప్రుఁ,
డసటి నీటను గడ్గి-యగ్గిచేతఁ।
గాచుకొన్నఁ బవిత్ర-గాత్రుఁడౌ బ్రాహ్మణ,
స్త్రీలు కుర్కురము తోఁ-డేలునక్క।
కఱచినవారలా-కాశంబునందలి,
గ్రహములు చుక్కలుఁ-గాంచవలయు।
నారేయి చీకటి-దైనచోఁ జంద్రుఁడే,
దిక్కుననుండు నా-దిక్కుఁ జూడ।

గీ. వలయుఁ బాలుఁడులేనట్టి-పల్లెయందు।
బ్రాహ్మణుని వేపి గఱచినఁ-బాలువాఁడు।
నెద్దుచుట్టు బ్రదక్షిణ-మేగి పిదప।
జలకమాడిన దోషంబు-తొలఁగిపోవు॥ ౫॥

ఉ. మాదిగవానిచేత మరి-మాలనిచేతను గోవుచేత నిం।
పేది విషంబుచేతను మ-హీసురుచేతను నాహితాగ్నిదూ।
పేదినవాని మంత్రవిధు-లెవ్వియులేక దహించి యస్థులా।
మీఁదటఁ బాలసద్ది యటు-మీఁదఁ బునర్దహనాదులొప్పగున్ ॥

గీ. అట్టిపీనుఁగుముట్టువా-రగ్గియిడెదు।
వారు దానికిజ్ఞాతులౌ-వారు దాని।
మోయువారును వీరెల్లఁ-జేయవలయు।
బుడమినొక్కఁ-బ్రాజాపత్య-మనుక్రమమున॥ ౭॥

సీ. తనయింటనగ్నిహోత్రములుండఁబరదేశ,
మునఁబ్రాకృతమ్మున-దనువుఁదొఱఁగు।
యజ్వకుఁబ్రేతకృ-త్యము లెట్లనినవిను,
డదివివరింతుమ-హాషులార।
యిఱ్ఱితోలుపఱచి-యేడువందలమోదు,
గుతోడిమలునుదర్భ-కోపులుగొని।
తలనలువదివంద-మొలఁగంఠమునబది,
యిన్నూఱుకడుపున-వృషణముల నే॥

గీ. నిమిదివ్రేళ్ళనుపదియుశి-శ్నముననైదు।
బాహువులనూఱుఁదొడలని-ర్వదొకటియును।
రెంటనువందలుమోకాళ్ళ-రెండుమూళ్ళు।
కాల్బొటనవ్రేళ్ళనిడినరా-కారమిచ్చు॥ ౮॥

సీ. కుడిచేతజుహువును-నెడమచేనుపభృత్తు,
నండమందరణి శ-మ్యయనుపాత్ర।
మునుశిశ్నమందుర-మ్మునదృషత్తుమరియు,
వీనులఁబ్రోక్షణి-వీపునందు।

ఱోలుఱోకలి నేతి-స్థాలికన్నులయందు,
మొగమునఁ దండుల-మును దిలలు ఘృ।
తంబును నోట శ్రో-త్రమునఁ గంటను ముక్కు,
ననుబంగరువు తున్క-లు నిచి సోద॥

గీ. రుండయినఁ జుట్టలయినఁ బు-త్రులయినను।
దానియం దెల్లనగ్ని హో-త్రమునకుఁదగు।
కరణములునుంచి యితఁడు స్వ-ర్గస్థుఁడగుత।
యనుచు నొక నేతియాహుతి-నునుపవలయు॥ ౯॥

ఉ. పిమ్మట నగ్ని కర్మములు-వేదవిధిన్ దగ నాచరింపనా।
నిమ్మెయిఁ జేయ యజ్వ గడి-యించును బ్రహ్మపదంబు।
బుణ్యలోకమ్ము గణించుఁ గర్తయిటు-గాదని స్వేచ్ఛ నొనర్చువారు స
త్యమ్ము గ ఘోర నారక వ్య-థాకులులౌదరు పుణ్యహీనులై॥ ౧౦॥

పంచమాధ్యాయము సమాప్తము

# షష్ఠాధ్యాయము.

క. మనుమార్గానుసరణమున।
వినుపింతు వినుండు బ్రాణి-వితతిఁ బొలియఁ జే।
సినపాపములకు శాస్త్రులు।
పనుపడఁగఁ బరాశరర్షి-పలికిన సరణిన్॥ ౧౧॥

తే. కోడి జక్కవ బెగ్గురు-క్రౌంచ యంచ।
జాలపాదంబు శరభంబు-చంపునాతఁ।
డొక్కపగ యిక్కరేయియు-నుపవసించి।
శుద్ధివడయును శాస్త్రప్ర-సిద్ధముగను॥ ౧౨॥

తే. గువ్వ కాకియుఁ దిత్తిరి-గోరవంక
ృకముజంపిన సంధ్యల-రెంటియందు।

మునిఁగినీటఁబ్రాణాయామ-మునుసలిపిన।
శుద్ధుఁడగునాతఁడీదిశాస్త్ర-చోదితంబు॥ ౧౩॥

ఆ. పెద్దపిట్టడేగ-గద్దశశాదంబుఁ।
జంపినతఁడువచ్చి-దుంపగమియుఁ।
బండ్లు మెసవియొకది-వసముండిమఱిమూఁడు।
పూటలుపవసింపఁ-బొందుశుద్ధి॥ ౧౪॥

తే. టిట్టిభముపాముకాటుక-పిట్టమొసలి।
లావికయుఁబావురంబుబ-లాకచిలుక।
వల్గులియుఁగోకిలయురక్త-పక్షమువధ।
చేసినను క్షేత్రమొకపూట-సేయవలయుఁ॥ ౧౫॥

క. భారద్వాజముమఱియుఁ జ।
కోరముపింగళయు వెండి-కురరమునింకన్।
గారండవంబుఁజంపిన।
వారలుశివపూజశుద్ధి-వడయుదురెపుడున్॥ ౧౬॥

క. పారావతమునుభాసము।
ఖేరుండముచాషముంగ-పింజలమును నే।
వారువధియింత్రు వారల।
హోరాత్రములుపవసించు-టుచితము శుచికై॥ ౧౭॥

ఆ. కొండచిలువపాము-డుండుభ మెలుకయు।
పిల్లిచంపెనేనిఁ-బెసలునువ్వు।
లుంచివండిపులగ-మొనరబ్రాహ్మణులకుఁ।
బెట్టిదక్షిణలును-బెట్టవలయు॥ ౧౮॥

ఆ. ఎవఁడునీటికోతి-నేదుబందియును గా
బేలునుడుముజంపి-వేయువాఁడు।

వెదకి తెచ్చి వట్టి-వృంతాక ఫలముల।
బగలు రాత్రి గడుపఁ-బడయు శుద్ధి॥ ౧౯॥

ఆ. నక్క చిఱుత పులియుఁ-గుక్కయుఁ దోడేలు।
నెలుగు వీని జంప-నెనయు దోసఁగు।
మంచి బ్రాహ్మణునకుఁ-గుంచెడు నావులు।
దానమిడినఁ జాలు-దాననడఁగు॥ ౨౦॥

ఆ. ఎనుము దున్నపోతు-నేనుఁగు లొంటిపిట।
హయము దీన నెద్ది-యైనఁ జంప।
మూఁడు వేళలందు-వాఁడు స్నానము జేసి।
యుపవసించె నేని నొందు శుద్ధి ౨౧॥

ఆ పులియు లేడి చిఱుత-పులి కోతి సింగంబు।
చంపె నేనిఁ ద్రిదివ-సములు పస్తు।
నుండి మీఁద బ్రాహ్మ-ణోత్తములకును సం।
తర్పణంబుఁ జేయఁ-దనర శుద్ధి॥ ౨౨॥

గీ. మృగము రోహిత్తు మేకయుఁ-దగరు పంది।
వధ మొనర్చిన నొక్క ది-వసము క్షేత్ర।
ముండె యామీఁద దున్నక-పండునట్టి।
వెదురు మొదలగు నన్నము-ను దినవలయు॥ ౨౩॥

గీ. ఇట్లు నాలుగు కాళుల-నెనఁగు జంతు।
వులను నడవి మెకంబులఁ-బొలియఁ జేసి।
నట్టిఁడొక నాఁ డుపవసించి-యంత మీఁద।
జాత వేదస జపమును-సలుపవలయు॥ ౨౪॥

సీ. స్త్రీని శిల్పిని వంట-వానిఁ గాపు వధింప,
ముంచుఁ బ్రాజాపత్య-ములను రెండు।

చేసియాపిమ్మటఁ-జేయఁగావలెనొక్క,
యాఁబోతుమఱిపది-యాలదాన।
మే నేరమునులేని-నృపతి నేనియువైశ్యు,
నేనియుఁజంపినఁ-గృచ్ఛ్రయుగము।
తగనిర్వదావుల-దానంబుఁ జేయఁగా,
వలయునుమఱి కాఁపు-కొలముగలసి॥

గీ. నట్టికోమటినొండెమ-హాఘపాత్రుఁ।
డైనద్విజునొండెఁజంపిన-ట్లైనతఁడొ।
నర్పఁగావలెఁజాంద్రాయ-ణంబుమూఁడు।
పదులగోదానమునుశుద్ధి-వడయుకొఱకు॥ ౨౫॥

క. చండాలునిఁజంపినబా।
పండొకకృచ్ఛ్రంబుమఱియుఁ-బ్రాజాపత్యం।
బొండునుసలిపిపదంపడి।
రెండాలనొసంగినందు-రితముక్తుఁడగున్॥ ౨౬॥

గీ. రాజు మొదలగునితరవ-ర్ణములకొప్ప।
సగముకృచ్ఛ్రంబుచండాలుఁ-జంపదొంగ।
మాలమాదిగవాండ్రఁజం-పద్విజుఁడొకది।
వసమునిట్రుండిపంచగ-వ్యముగొనవలె॥ ౨౭॥

సీ. వసుధజండాలశ్వ-పాకులతోడసం,
భాషించె నేనిబ్రా-హ్మణుఁడు వేద।
మభ్యసించినబ్రాహ్మ-ణాళితోమాటాడి.
యొండెనుగాయత్రి-యొక్కసారి।
జపియించియొండెదో-షముబాయునొరిమతో,
జండాలుసెజ్జఁబ-రుండెనేని।

మూఁడునాళ్ళుపవాస-మును జేయునది వాని,
తోనొకతోవసే-త్వానునడచె॥

గీ. సేని గాయత్రిఁ దలఁచిన-దానశుద్ధి।
వడయు వానినిఁ గనుఁగొన్న-పాపమెల్లఁ।
బంకజాప్తునిఁ జూచినఁ-బాయు వానిఁ।
ముట్టినసచేలముగ నీట-మునుఁగవలయు॥ ౨౯॥

చ. పగలుపవాసముండునది-పాఱుఁడెఱుంగక మాలనూతదూ।
పగొనినఁ దానెఱింగియును-బానము జేసినఁ బస్తురాత్రియుం।
బగలనునుండఁగావలయు-మాలఁడుకుండలముంచునెబ్రబా।
విఁగుడువమూఁడునాళ్ళుయవ-పిష్టము బంచితమున్ దినందగున్॥

గీ. మఱియు నెఱుఁగక బాపఁడు-మాలవాని।
కుండనీర్ద్రావి తెలిసిదో-షకానెనేని।
నవసరంబు ప్రాజాపత్య-మదియు మిడిన।
సాంతపనకృచ్ఛ్రమాతఁడు-సలుపవలయు॥ ౩౦॥

గీ. తెలిసి చండాలుకుండలో-జలము ద్రావ।
దవిలియగ్రజన్ముండు సాం-తపనకృచ్ఛ్ర।
మవని భర్త ప్రాజాపత్య-మందు సగము।
వైశ్యుఁడందర్ధమునుఁ గాపు-వలయుఁ జేయ॥ ౩౧॥

ఉ. చోకలియాదిగాఁగఁ గడ-జాతులకుండలఁ బాలు పెర్గునీ।
ర్జైకొని రేనిఁ బాఱునకు-ఱేనికి బేరికి బ్రహ్మకూర్చమున్।
జోకను పోష్యముం గలుగు-శూద్రునికోపినదానమంతియే।
గాకయు పోష్యముం గలదు-కాయపవిత్రత చేసికొంటకున్॥ ౩౨॥

గీ. ఏకరణి నైన బ్రాహ్మణుఁ-డెఱుకలేక।
మాలయన్నంబు గుడిచిన-మంచియావు।

పంచితమునయవలపిండి-వండిదానిఁ।
బదిదినంబులుతినిశుద్ధి-పడయువలయు॥ ౩౩॥

క. స్నానాదినియమములుఁగల।
వానికిగోమూత్రమందు-వండుయవాన్నం।
బేనియతిదినమునకుఁగడి।
బోనముగాఁబదిదినములు-భుజియింపఁదగున్॥ ౩౪॥

చ. అరయఁగరాకకొంతదడ-వగ్రజుగేహమునందుమాలవాఁ।
డొరిమఁజరించుచుండియది-యొక్కఁడుఁదోఁచినఁబాలువారుస।
త్కరుణననుగ్రహింత్రుతగు-ధర్మములంబరికించిదానికి।
న్విరుగుడొనర్తురిమానివర-విస్తృతవాక్యప్రమాణపద్ధతిన్॥ ౩౫॥

సీ. పైవిధంబునమైల-వడినయింటికిఁబెద్ద,
యునునింటివారెల్ల-ననుదినంబు।
మూఁడువేళలస్నాన-మాడియవాన్నంబు,
పెఱుగునేయియుఁబాలు-వరుసమెరయ।
మూఁడేసిదినములు-భుజియించిపిమ్మట,
నొక్కొక్కదినమదే-మెక్కవలయు।
నావుపంచితమున-నమరించినట్టిపై,
యావకంబునఁబుర్వ-లైననెంగి॥

గీ. లైననున్ననుదినస-హ్యముగనున్నఁ।
బరిహరించుటయొప్పను-మరియుఁబెఱుఁగు।
మూఁడుపలములుపాలును-మూఁడుపలము।
లొకపలమునేయివలసిన-నొప్పఁజేర్ప॥ ౩౬॥

చ. వెలిమిడిఁగంచురాగియుఁబ-విత్రతఁగాంచునువస్త్రిముల్ జల।
మ్ములశుచిఁజెందుమృణ్మయస-మూహముదూరముపాఱవైవఁగా।

వలయుఁగుసుంభమాజ్యమును-బ్రత్తియుబెల్లమునూనెయుప్పవా।
కెళులదిరంబుగానునిచి-గేహముజిచ్చిడికాల్చుటొప్పగున్॥ ౩౭॥

క. ఈవడువునశుచిఁగైకొని।
యావలబ్రాహ్మణులకెల్ల-నన్నమిడవలెన్।
గోవులుముప్పదియొకయొ।
ద్దీవలెదక్షిణగఁదప్ప-దిదియొండేనిన్॥ ౩౮

ఆ. మఱియుఁబైవిధమున-మయిలవడ్డగృహంబు।
కట్టినట్టిపట్లఁ-గలయనలుక।
వలయుఁగొతమయెడలఁ-బాఱులునివసింప।
నొండెఁద్రవ్యనొండె-నొదవుశుద్ధి॥ ౩౯॥

సీ. పొలమునుబొరుగూరుఁ-బోవుచోఁనెఱుఁగక,
మాలనితోనొక్క-మాసమొండె।
సగమొండెసంగాత-ముగనున్ననంతియ,
దినములుగోమూత్ర-మునుయవాన్న।
మునుదిన్నచోఁశుద్ధిఁ-బొందునుమఱియును,
జాకితమాదిగ-జాతిదియును।
నెఱుకతచెంచెత-యిందులోనెవతైయై,
ననెఱుంగఁబడకతా-నునివసించె॥

గీ. నేనిఁదెలిసినపిమ్మట-నింటివారు।
నాల్గుకోలములనెవ్వరై-ననువిడువక।
పైవిధించినదానిలో-పలసగంబు।
నుచితమగుఁజేయునిలుగాల్చు-టొప్పదిచట॥ ౪౦॥

గీ. చొరవచ్చే మాలవాఁడిలు-జొచ్చెనేని।
నిలువెడలఁగొట్టి మృణ్మయం-బులుత్యజించి।

గోమయజలంబుచే నలు-కుటయుచితము।
నేయిమొదలగునవి పాఱఁబోయఁదగదు॥ ౪౧॥

గీ. పుండొకటి పాలువానికిఁ-బుట్టె చీము।
నెత్తురుంబర్వికంపెత్తె-నేని యావు।
పెఱుఁగు పాల్పించితము నేయి-పేడఁగలిపి।
యదియె స్నానము పానముఁ-ద్రిదివసములు॥ ౪౨॥

గీ. క్షత్త్రియుండైన నైదుమా-షములయెత్తు।
బంగరీవలె దానంబు-బచ్చునకొక।
క్షేత్రమునుగోవు దానంబు-సేయఁదగును।
వానమీవలెఁ బస్తుండఁ-దగదు కాఁపు॥ ౪౩॥

క. ప్రాయశ్చిత్తముపూర్ణం।
బాయెనటంచగ్రజన్ముఁ-డను వాక్యముఁ జే।
దోయిముకుళించి మన్ననఁ।
జేయుట యొకగొప్పక్రతువు-సేయుటకుఁదగున్॥ ౪౪॥

క. జపమందలికొఱఁతయు స।
త్తపమందలికొఱఁత యజ్ఞ-తతిఁగొఱఁతయు వి।
ష్టపమున సద్విప్రులచే।
నుపవాదిత వాక్యమున నె-యొగిపూర్ణమగున్॥ ౪౫॥

గీ. వ్యాధిపీడమినఁ బడలిక-వడినఁబగతు।
రొత్తిననుగ అవుదొడరిన-హోమములును।
వ్రతములుపవాసములుతగు-బ్రాహ్మణాళి।
చేతఁజేయింపనగు శాస్త్ర-సిద్ధమిదియ॥ ౪౬॥

గీ. అట్లుచేయింపకున్న బ్రా-హ్మణులలెస్స।
పనుపవలె వారు కామితా-ర్థములిడుదురు।

బాలురను ముదుసళ్ళదు-ర్బలులనుగ్రా
హింపఁడేసుదురు దగరన్య-లెవ్వరేని॥ ౪౭॥

గీ. నెయ్యముననొండె డబ్బుగ-ణింపనొండె।
భయమువడియొండె నజ్ఞాన-వశతనొండె।
నగ్రజులుబలవంతు న-నుగ్రహించి।
రేని నాతనిపాపము-లెనయుఁదమ్ము॥ ౪౮॥

క. చానున్నహానికే ని।
స్థానియమములునువిధింపఁ-జనదది భగవ।
ద్ధ్యానముఁజేయుచు బలిష్ఠుం।
డౌ నాతనికవిధింపే-నగు నిశ్శంకన్॥ ౪౯॥

క. ఏ తెవులులేనివారికి।
బ్రాతినిలిచిమీకులేదు-పనియనినియమ।
వ్రాతములుతామెతీర్చినఁ।
బాతకులైనరకమునను-బడుదురువరుసన్॥ ౫౦॥

ఉ. పాటులలెక్కఁబెట్టకుప-వాసవ్రతాదులుపూనిస్వేచ్ఛనం।
చారముసేయువాఁడు పలు-చందములంజెడు దోషయుక్తుఁయిం।
పారదుధర్మముల్ దెలియు-నట్టిద్విజన్ములుపెక్కురేని మే।
లారసియొక్కఁడేనిపరి-హారముఁలెస్సవిధింపఁగాఁదగున్॥ ౫౧॥

గీ. తనకుఁదానప్రాయశ్చిత్త-మునువిధించు।
కొన్న శిశుహత్యదాకును-జన్నిగట్టు।
తిరుగుతీర్థంబుపుణ్యన-దియనిసుజన।
వచనమఘహరమనియును-వలయుఁదెలియ॥ ౫౨॥

శా. సాకల్యంబగుబ్రాహ్మణోత్తములభా-షల్ దేవతాలోకమం।
గీకారంబొనరించుఁబాఱులనఁగా-గీర్వాణసామ్యల్ తదం।

గీకారంబగుతీర్థమంత్రజపముల్ - క్షేత్రాదినిష్ఠల్లవో।
వాకంబుల్ పరిపూర్ణమైమరియు సా-ఫల్యంబులైచెన్నగున్ ॥౫౩॥

సీ. పురువీగవెంద్రుక-ముట్టినయన్నంబు,
నడుమబూడిదెనీళు-లిడినశుద్ధి।
కుడుముచో బ్రాహ్మణుఁ-డెడమచేఁగాలంటఁ,
దగదుపాపమువచ్చు-దానమఱియుఁ।
బాత్రింబునెడమచేఁ-బట్టకభుజియింపఁ,
దగదు పైపాపంబె-దానఁగలుగు।
నిలుచుండియొండె ము-చ్చెలతోడనొండె మం
చమునఁనుండియునొండెఁ-జనదుకుడువఁ।

గీ. గుడుచుతఱిమాలనేనియుఁ-గుక్కనొండె।
గన్ననన్నంబువిడుచుట-కర్జమింక।
తగనికూడుననద్ది శు-ద్ధిఁగను తెలుఁగు।
వినుతువినుఁడు పరాశర-మునిమతమున॥ ౫౪॥

క. అన్నము ద్రోణాఢకమిత।
మున్నెడఁగుక్క-యునుఁగాకి-యునుఁదాఁకిన నా।
యన్నఁపుశుద్ధిక్రమమును।
దిన్నఁగ బ్రాహ్మణులనడిగి-తెలిసికొనఁదగున్॥ ౫౫॥

క. తానెంతపండితుండే।
కానీ బ్రాహ్మణులుచెప్పు-క్రమముననడుపం।
గానగునావంటకమును।
మానంగారాదుశుద్ధి-మార్గంబుంటన్॥ ౫౬॥

గీ. ముప్పదియురెంగుకుంచమ్ము-లొప్పద్రోణ।
మాఢకమురెండుకుంచమ్ము-లయ్యెననుచు।

వేదవిదులం డ్రుమతియుని-వ్విధము బోయు।
వంటకము శ్రేష్ఠముగ (గొం డ్రు-ప్రాజ్ఞులెల్ల॥ ౫౭॥

ఆ. కుక్క-కాకితిన్న-గోవుగాఁడె దెమూరు।
కొన్న స్వల్పమన్న-మున్న విడువ।
వలయు ద్రోణమున్న-బలవంతుఁడాఢక।
మున్న బీద శుద్ధి-యొప్పఁ జేయ॥ ౫౮॥

చ తగిలినచోటు లెంగిళులుఁ-దాకినచోటులుతీసి పైఁడినీ।
ళ్ళఁగలయఁజల్లినిప్పుసెగ-లోనిడియన్నము వేదనాదమొ।
ప్పఁగఁదిననొప్పు గ్గోఘృతము-పాలునుఁగుక్కలుతిన్న స్వల్పమే।
నిఁగడవఁద్రోయుటొప్పు నవి-నిండుగనుండినశుద్ధియొప్పగుణ॥

గీ. అగ్గిచుట్టును ద్రిప్పిన-నావుపాలు।
శుద్ధియగు నేయి కాచిన-శుద్ధియగును।
గనుకనివిమిక్కిలిగనున్నఁ-గడవఁబెట్టు।
టనుచితము శుద్ధిసేయంగ-ననువుకలిమి॥ ౬౦॥

షష్ఠాధ్యాయము సంపూర్ణము.

## సప్తమాధ్యాయము.

---

గీ. ప్రబలుఁడైవట్టి వృద్ధప-రాశరర్షి।
పద్ధతినిఁబట్టియిఁక ద్రవ్య-శుద్ధికొఱకు।
వలయు నాచారములనుని-మ్మశముతోడ।
నాలకించుఁడువినుతుమ-హర్షులార॥ ౬౧॥

సీ. కట్టెచేఁజేయించి-నట్టివస్తువులెల్ల,
చెక్కించుటవలనఁ-జెందుశుద్ధి।
కంచుబూడిదెచేతఁ-గడిగినశుచిరాగి,
చింతపండేసిమా-ర్జింపశుద్ధి।
యువిదతాఁగడుపు కా-కుండెనేనిబహిష్ట,
యైనచోనదిశుద్ధి-యగునుమతియుఁ।
గలసినమైలలు-గానరాకుండఁగ,
బాఱుటచేతనే యేఱుశుద్ధి।

గీ. కొలఁకులనుచెఱువులనునూ-తులనుమైల।
గలసెనేనప్పుడొకనూఱు-కడవలేసి।
నీళ్లుదీయించివానిలో-నిర్మలంపుఁ।
బంచగవ్యంబుఁగలిపిన-ప్పటికిశుద్ధి॥ ౬౧

ఆ. బాలకెనిమిదేండ్లు-పడినగౌరియుఁదొమ్మి।
దగుడురోహిణిపది-యైనఁగన్య।
దానిపైరజస్వ-లానామయిట్లుగా।
వయసుఁబట్టిపేళ్ళు-పడుచులకును॥ ౬౨

గీ. వయసుపన్నెండునిండన-ప్పుడుచుపెండ్లి:
సేయకుండినఁబితరులు-హేయమైన।
తద్రజఃపానమొనరింత్రు-తప్పకుండ।
నెలనెలకటంచుఁజెప్పిర-నేకఋషులు॥ ౬౩

గీ. పెండ్లికెదిగినపిల్లకుఁ-బెండ్లిసేయ।
కట్టులుంచిననదిసమ-ర్తాడెనేని।
దానిఁగనుఁగొన్నతల్లియుఁ-దండ్రియన్న।
వీరుమువ్వురునరకంబుఁ-జేరువారు॥ ౬౪

ఉ. పాడికిదూరమంచనక-బ్రాహ్మణుఁడాచటమత్తుఁడై సమ।
ర్తాడినఁగాడుబిడ్డనున-నంగవశీకృతదుర్మనీషఁబెం।
డ్లాడినవాఁడుపఙ్క్తికిన-నర్హుఁడభాష్యుఁడువానిసజ్జనుల్।
వీడుటలెస్స వాఁడువృష-లీపతియైపతితుండుకావునన్॥ ౬౬॥

మత్తకోకిల.

పైవిధమ్మున నేద్విజుండువి-వాహితుండయియాపయిన్।
దైవికమ్మగుదానికైపరి-తాపమొందునొ వాఁడుభీ।
త్యావశమ్మునఁబొట్టగడ్పుచు-సజ్జపమ్మునుసేయుచున్।
జేవమైఁదిగద్యేఁడులున్నన-శించుదోషములన్నియున్॥ ౬౭॥

గీ. త్రేలమాలనుబొలిఁత-రాలినిశవ।
మునుమటియునుఁబతితునిము-ట్టిన ద్విజుండు।
నగ్గిబంగరు నెలవీని-యందునొకటిఁ।
గాంచినీళ్ళాడవలయున-గ్రజునిమాట॥ ౬౮॥

సీ. బైలైనబ్రాహ్మణ-భామలొండొరుఁదాక,
రాత్రితత్రియమ్ము క్షే-త్రమ్మునట్టి!
బ్రాహ్మణక్షత్రియ-వనితలొండొరుముట్ట,
నదియర్థకృచ్ఛ్రంబి-దందుసగము।
బ్రాహ్మణస్త్రీవైశ్య-రమణులంటినమూఁడు,
పాతికలదియొక్క--పాతికయిది।
బ్రాహ్మణస్త్రీశూద్ర-రామలుముట్టిన,
నదికృచ్ఛ్రమునుదాన-మిదియవరుస।

గీ. నాచరించినబరిశుద్ధ-లగుదురందు।
నవలబోయినవారునా-ల్గవదినమ్ము।
స్నాతలై దైవపైతృక-సమయములకుఁ।
బనికివత్తురు నాలుగు-వర్ణములను॥ ౬౯॥

ఆ. సతతమింతిరుగ్వ-శమునముట్టగుచున్న।
నంటులేదుగృహము-నందునాకె।
యన్నిపనులుసేయ-నగుఁగానిహవ్యక।
వ్యములనాపెనుంప-ననువుపడదు॥ ౨౦॥

ఆ. మొదటిదినముమాల-ముండరెండవరోజు।
పాఱుఁజంపినట్టి-పాపిమూఁటఁ।
జాకితయునునిట్లు-జరిగిననాల్దవ।
నాడుశుద్ధిబైటి-యాడఁగులకు॥ ౨౧॥

ఉ. వేదురుగొన్నవానికిల-భించినమైలలువాపవచ్చునెన్నా।
నాదులులేకయెట్లనన-నాతురుఁడొక్కఁడుముందుగ్రుంకియా।
మీఁదటరోగినంటుచటు-మీఁదటఁగ్రుంకుచుమాటిమాటికిన్।
సాదరమొప్పనట్లుపది-సారులుచేసినశుద్ధిచేకురున్॥ ౨౨॥

ఆ. వేపిచేతనయినఁ-గాఁపుచేనైనను।
నంటుపాఱుచేత-నయిననంటు।
బాపఁడంటువడిన-మాపునఁబస్తుండి।
పంచగవ్యశుద్ధిఁ-బడయవలయు॥ ౨౩॥

గీ. ఎంగిలెనయనికాఁపును-హీసురవరు।
ముట్టినట్లైనవగాహ-మునను శుద్ధి।
యెంగిలెవసినకాఁపుమ-హీసురవరు।
ముట్టినయెడఁబ్రాజాపత్య-ముసలుపవలె॥ ౨౪॥

సీ. కల్లుసోకిఁనకంచుఁ-గాలిచితరిమివె,
లిమిడిఁగడ్గినఁబవి-త్రమగుఁగల్లు।
సోఁకనిదైనచో-శుభ్రంబుగాభస్మ,
మూనఁదోమవలయును-శునకమొండెఁ।

గాక మొండెనుగంచు-సోఁకిన నావుమూ,
తొక్కన్నఁగా పెంగిలి-గొన్న బూదిఁ।
బదిమాల్లుకడుగఁగా-వలెఁబుక్కిలింతల,
కునుఁగాల్లఁగడుగుట-కొలకు వాఁడ॥

గీ. బద్ధకంచము నేలలోఁ-బాతియాలు।
నెలలపిమ్మట వాడఁగా-వలయు నినుము।
నినుపరాపిడిచేసీస-మింగలమునుఁ।
జూపితీయుట చేతను-శుద్ధివడయు। ౭౫॥

గీ. దంతమెముక్కయుఁ గొమ్ము ర-త్నములు వెండి।
బంగరవు వీనితోఁజేయు-వస్తువులను।
జిందమున నీటఁగడిగినఁ-జెందు శుద్ధి।
మృణ్మయంబులు కాల్చిన-నెనయు శుద్ధి॥ ౭౬॥

సీ. వెదురతోఁజేసిన-వివిధవస్తువులు గం,
బళములు నార చీ-రెలును బట్టు।
పుట్టముల్ ధాన్యంబు-భుజపత్రియును బేరిప,
పనిముట్లు దూది వ-ల్కలును పండు।
లిట్టి చర్మములు-నెవియేని గడ్డిక,
సవులనల్లిన తాళ్ళు-జన్పగోనె।
లివినీళ్ళఁజిల్కిన-నెనయును శుచితాతి,
చిప్పలు తాతఘు-ర్షించి నీటఁ।

గీ. గడిగిన బైనమడియగుఁ-దడవులేక।
తలగడలు దిండ్లు పఱుపు లు-త్తమములైన।
యొఱుపువస్త్రము లెండ వే-యించి నీళ్ళు।
జిలికినంతట శుచియని-తెలియవలయు॥ ౭౭॥

క. వెలయంగఁ బల్లులీగలు।
బులుఁగులుగప్పలునుఁబురువు-పుట్రలమేధ్యం।
బులఁబొరలితాకినను మై।
లులులేవనిచెప్పె మనువి-లం బ్రకటముగన్॥ ౭౮॥

ఆ. నేలముట్టిచిలుకు-నీరుతమ్మలమిత్తు।
దండము మఱి పంచ-దారతినఁగ।
మిగులు జిడ్డువోటి-నెగయుతుంపురసోమ।
మిదిసమస్తమెంగి-లెనయదెపుడు॥ ౭౯॥

ఆ. తోఁవబాడిచినుకు-నావయుదారి వెం।
బడినిమొలచుగడ్డి-మఱియుఁ గాల్చి।
నట్టి యిటుకలుంచి-కట్టినజగతియు।
నెండగాడ్పువారి-నెనయుశుద్ధి॥ ౮౦॥

క. నారులకదుష్టసంతత।
ధారలకజ్ఞానబాల్య-ధారులకుజరా।
భారులకువలిదుమారఁపు।
బారులకెయ్యెడలనశుచి-వాటిల్లదిలన్॥ ౮౧॥

ఉ. లాతివిలాతినున్నపుడు-లావఱినప్పుడురోగతాప సం।
పాతితుఁడైనయప్డు పురి-బాసినయప్డిది పున్నెమిద్దియున్।
బాతకమంచునెంచక యు-పాయమునందనువోమియాపయున్।
జేతనమందినప్పటికిఁ-జేయనగున్విధిదృష్టకర్మముల్॥ ౮౨॥

సప్తమాధ్యాయము సంపూర్ణము.

## అష్టమాధ్యాయము.



క. అట్టిటుతిరిగెడి వేళలఁ।
గట్టిన మెడత్రాళ్ళు బిగిసి-కటకటఁబడియా।
వెట్టోతలఁ పనితలఁపున।
గిట్టినపాప మెట్లు-గిట్టునెటన్నన్॥ ౨-౩॥

గీ. వేదములు లెస్సఁజదివి స్వ-వృత్తిననుస।
రించుధర్మంబులం దాస్థ-మించువిప్రు।
దర్శనము సేసియతనికిఁ-దనదుదోష।
మెల్లవిన్నఁ జెప్పవలెఁ దేట-తెల్లముగను॥ ౨-౪॥

గీ. సవితబోధించు గాయత్రి-జపమునగ్ని।
కార్యమును సంధ్యలను పాంస్తి-గడవఁబెట్టి।
సేద్యమొనరించువానినిఁ-జోద్యమొప్పఁ।
జేరనకుఁ బాఱుడని వానిఁ-బిలుచుటొప్పు। ౨-౫॥

ఆ. వ్రతములుడిగి మంత్ర-వితతులు వోఁద్రోఁచి।
కాలము పేరు సెప్పి-కొనుచుఁ గడుపు।
గడుపువారు వేవు-రౌడఁగూడియున్నను।
నదిసభాఖ్యఁ దనరు-టవనినరిది। ౨-౬.

సీ. ధర్మముల్ దెలిసియుఁ-దగని ప్రాయశ్చిత్త,
మువిధించు నేని న-మ్మూఢబుద్ధి।
కృతపడినట్టి దు-రితమునూఱంత,
లనుభవించునొకండు-వినికిఁగలిమి।

ధర్మముల్ బోధింపఁ-దలఁకొన్న చోఁదదు,
క్తములు శాస్త్రప్రసి-ద్ధములెయయ్యె।
దానఁగృతాపరా-ధదురితములు వాసి.
చెప్పినవానినిఁ-జెందుఁగాన।

గీ. వేదములు లెస్సఁజదివిన-పెద్దవారు।
ముప్వురైననలువురైన-మొనసి చెప్ప।
నదిహితమ్ముగఁగొనవలెఁ-దదితరులు స।
హస్రమైననుఁజేకొను।టనుచితంబు॥ ౮౭॥

సీ. శాస్త్రోక్తమార్గంబు-సత్యంబుగాధర్మ,
పద్ధతిరూపించు-పావనులకుఁ।
బాపము ల్వేఱ చను-బరిషదాజ్ఞాపిత,
కృతదురితునిపాప-వితతిఁజూడ।
ఆతినుండుజలంబు-వాతాతపంబులఁ,
జాడ్పునమాసివే-శంబునైన।
సభికులఁజెందక-సాపరాధునియెడఁ,
దవులకతనలోనఁ-దానడంగు।

గీ. నాహితాగ్నులునుసమర్థు-లాగమజ్ఞు।
లైనబ్రాహ్మణులునలుగు-రేనిముప్వు।
రేనిఁగూడినసభయగు-దానియాన।
నాదలవహించుటయశాస్త్ర-చోదితంబు॥ ౮౮॥

గీ. ఆగమతదంగపారగు-లైయనాహి।
తాగ్నులగువారలైదుగు-రైనముప్వు।
రైననదిసభయనఁదగు-దానియాన।
సాపరాధునిదురితచ-యంబువాయు॥ ౮౯॥

క. మునులుపరతత్త్వవిద్యా।
ఘనులుద్విజులుబహుళయజ్ఞ-కర్తలుస్వాధ్యా।
యనిరతులునుస్నాతులునగు।
జనములనొక్కండయేని-సభదాననగున్॥ ౯౦॥

క. ఈరీతిమీఁదఁజెప్పిన।
వారలునేకూరరేని-స్వకులోచితసం।
చారముననొప్పమువ్వురు।
సారజ్ఞులుచేరిరేని-సభదాననగున్॥ ౯౧॥

గీ. కేవలమునామధారణ-జీవనులగు।
నేతదతిరిక్తులగువిప్రు-లెందఱేనిఁ।
గాదుసభకఱ్ఱయేనుఁగు-కరణిఁజర్మ।
మృగముగతిమూఢవిప్రుఁడు-రిక్తుఁడగుట॥ ౯౨॥

గీ. జనములేనట్టియూరును-జలములేని।
నూయివెలిమిడివ్రేల్చిన-నేయిచాల।
నేలషండుఁడుమూర్ఖుని-కేలనిడ్డ।
వితరణముమంత్రిమెఱుఁగని-ద్విజుఁడుసములు॥ ౯౩॥

గీ. క్రమముమీఱసర్వావయ-వములచేతఁ।
జిత్తరువుపూర్ణమయిప్రకా-శించునట్లు।
మంత్రసంస్కారవిధులచే-మహీసురులును।
పూతులైలెస్సఁబొల్తురు-భూతలమున॥ ౯౪॥

గీ. పేరునకుఁబాఱులైశాస్త్ర-విధియెఱుఁగక।
దీనికిదివిరుగుడనివి-ధించువారు।
వారియానతినడుచున-వాఁడువీర।
లెల్లరునునరకమునుదా-మెనయువారు॥ ౯౫॥

సీ. పంచయజ్ఞంబుల-బహుతరాసక్తులై,
వేదముల్సదువుచు-ద్విజులుతాము
విషయసంసక్తులై-వివిధభోగంబులఁ,
గ్రాలుచుండియుముజ్జ-గములదాఁటఁ।
గాఁజేయఁగలరని-క్రముశ్మశానంబున,
నెళవుఁగైకొనుచుఁబ్ర-జ్వలనమొంది।
సర్వంబునుదహించు-సాక్షాత్కృపీటజ,
న్మునిచాడ్పననుబ్రాహ్మ-ణుండుతాను।

గీ. నెందునేమేమిఁగుడిచిన-నెగ్గులేదు।
దైవపముఁడాతఁడశుచిప-దార్థచయము।
జలమునందెట్టులట్లగ్ని-జన్మలందుఁ।
బాపములనెల్లనుంచుట-పరమహితము॥ ౯౬॥

క. అపవర్గదగాయత్రి।
జపరిక్తుండంత్యవర్ణ-సముఁడనియెనుద।
జ్జపయుక్తుండైనఁద్రివి।
ష్టపపూజ్యుండనియునెఱుఁగఁ-జనునెల్లెడలన్॥ ౯౭

గీ. చెవఁటియయ్యునుబాఱుండు-సేవనీయుఁ।
డవనికాఁపుజితేంద్రియుఁ-డయ్యుఁబూజఁ।
గొనననర్హుఁడుచెడుగని-గోవుపీడి।
పాడిగాడిదెపిదుకఁబో-వాఁడుగలఁడె॥ ౯౮॥

గీ. ధర్మశాస్త్రరథారూఢ-తయునువేద।
ఖడ్గధారణమునుజెలఁ-గంగవెలుఁగు।
పాఱుఁడువినోదమునఁజెప్పు-వానమయినఁ।
బాటిసేయంగవలెధర్మ-ఫక్కిగఁగొని॥ ౯౯॥

సీ. సాంగముగా శ్రుతి-స్వాధ్యాయ మొనరించి,
షట్ఛాస్త్రములు లెస్సఁ-జదివిపిదప।
గార్హస్థ్యమే మున్నగాఁ-గల్గునాశ్రమ,
త్రయమునుజరిపెడు-ధర్మవిదులు।
పదుగురు చేరిన-నదిముఖ్యసభయనఁ,
జనునల్పములకట్టి-సభలుగూడి।
పుడమిఁ బ్రాయశ్చిత్త-ము విధింపఁగావచ్చుఁ,
దప్పిద మొకవేళ-గొప్పదైన॥

గీ. రాజు నానతిఁగొనవలె-రాజుగూడ।
బ్రాహ్మణాజ్ఞను మీఱఁగా-రాదతండు।
మీఱి నిష్కృతిఁ దానియ-మించెనేనిఁ।
బాతకము నూఱువిధముల-వానిఁ జెందు॥ ౧౦౦॥

క. ప్రాయశ్చిత్తములను దే।
వాయతనాగ్రములనిచ్చి-యాత్మశుచికిఁగాఁ।
జేయఁగవలెఁ గృచ్ఛ్రంబును।
గాయత్రీజపమునిష్ఠ-గడలుకొనంగన్॥ ౧౦౧॥

గీ. జుట్టుసయితము తలబోడ-గొట్టుకొనిత్రి।
సంధ్యలను స్నాతుఁడై రాత్రి-సమయమందు।
నాలనడుమున వసియించి-యంతపవలు।
వానితోఁ దిరుగాడఁగా-వలయు మఱియు॥ ౧౦౨॥

క. చలివానయెండ సుడిగా।
డ్పులవలనన్ వలను కొలఁదిఁ-బోషించినఁగా।
కిల నాలకన్నమును ముం।
గలతన సంరక్షణంబ-కార్యమతనికిన్॥ ౧౦౩॥

మ. తనదౌండైన్య తిరియొడ్లదౌండైనగుస-ద్మంబందుఁగళ్యాననోం।
డెనుగోబృందముజొచ్చిమేయు నెడఁగా-నీ లేఁగ పార్థాగ్రపు।
ట్లనుగానీజనదద్దిచెప్పుమటియా-లక్ముందుగాఁదన్పి తాఁ।
జనునీర్ధాగ్రివఁగనిండ్లకవ్విజనస్వే-చ్ఛక్దానునుక్రాఁజనుక్॥

గీ. బురదదిగవడ్డమొదవును-గరుణగలిగి।
సత్తువకొలందివడిలేవ-నెత్తవలయుఁ।
జనదుపేక్షింపగోవ్రత-మాచరించు।
వారికివిముఖ్య విధులని-వలయుఁదెలియ॥ ౧౦౫॥

శా. ఏఁపుంజూపుచుగోద్విజప్రతతికై-యెవ్వండుతాఁజచ్చునో।
యాపుణ్యుండుద్విజఘ్నదోషవిగతుం-డైయొప్పుగోహంతపా్రి।
జాపత్యంబునుజేయఁగావలయుని-ష్ఠాయుక్తుఁడైయట్టిపా్రి।
జాపత్యంబునునాల్గుభేదములుగా-జానౌనదెట్లన్నచోక్॥ ౧౦౬॥

సీ. ఒకటిరెండునుమూఁడు-నొగినాలుగేడులు,
గలగోవుఁజంపిన-కఠినహృదయుఁ।
లొకటేనిరెండేసి-యునుమూఁడునాల్గేసి,
దివసమ్ములతినిష్ఠఁ-దేజరిల్లి।
యొక్క-పొద్దునునక్త-మోగిరముడిగియు,
క్షేత్రంబుక్రమమొప్పఁ-జేయవలయు।
నట్లుచేసివమీఁద-నగ్రజన్ములఁబిల్చి,
యన్నంబుదక్షిణ-లందఁజేసి॥

గీ. శుద్ధిఁగలిగించుపవమాన-సూక్తివితతి।
జపముసల్పఁగవలయుని-స్సంశయముగ।
నగ్రజులకన్నమిడెడుపు-ణ్యంబువలన।
నాలఁజంపినపాపంబు-నడఁగిపోవు॥ ౧౦౭॥

అష్టమాధ్యాయము సమాప్తము.

## నవమాధ్యాయము.

గీ. కావఁగాగోవులనుదాఁటఁ-గట్టుటయును।
దొడ్డిమొదలగు వానిలో-నడ్డుటయును।
బోలుదోసఁగబ్బదిదిబుద్ధి-పూర్వకమునఁ।
జేయుగోహత్యయని-చింత-సేయఁదగదు॥ ౧౦౮॥

గీ. చెప్పఁబోయెడుగుణముల-నొప్పదండ।
మునను గాకొకదుడ్డుఁజేఁ-గొనుచుఁగొట్టి।
రేనిగోహత్యకుఁదగుని-ష్కృతికిద్విగుణ।
మొనరఁజేయుఁగవలెఁదప్ప-టొప్పదెందు॥ ౧౦౯॥

సీ. తనరరోధమునుబం-ధనముయోక్త్రముపాత,
మను నాల్గుపేళ్ళ గో-హత్యలొప్పఁ।
బాతికసగముము-ప్పాతికపూర్ణమౌ,
వరుసనునిష్కృతు-లొవ్వనికమరుఁ।
గడలియొడ్డున నేటి-గట్టులఁజెఱువుఁల,
దరులందుఁగాలిన-స్థలములందుఁ।
జొరరానిత్రోవల-మెరకపల్లములందు,
నిండ్లపట్టులదొడ్ల-నేళ్ళుగలయు॥

గీ. పజ్జలందావులేపటి-పడుటరోధ।
మంద్రుమెడత్రాళ్ళుకట్టుత్రా-ళ్ళురుతముప్ప।
త్రాఁడులునుగవ్వత్రాఁడులు-తగులుకొనుచు।
నింట నేనియుఁగాటియం-దేనిఁదెగుట॥ ౧౧౦॥

గీ. బంధమనియందురిందొక్క-ఫక్కిగలదు।
గోవుతనుదానఁదాళ్ళఁజి-క్కుకొనిచచ్చు।
టయునుగట్టంగఁబడిచచ్చు-టయునుసమమ।
బంధమనరెంటికిన్నిఁజెల్ల-వలయునెందు॥ ౧౧౧॥

గీ. నాగిలియుబండిరాడుకం-ట్లాముకట్టఁ।
బడినవేళలనాబర్వు-వలననెద్దు।
బిడ్డుటిదియో క్త్రిమందుర-పిదపఁబాత।
మునకువిధమెట్టిదనినచో-వినుతువినుఁడు॥ ౧౧౨॥

ఆ. కండకావరమునఁ-గ్రైపెక్కి-చిత్తచం।
చలతఁదెలిసియుండెఁ-దెలియకొండెఁ।
దలఁచితలఁపకొండె-దయమాలిపాళ్లతోఁ।
గట్టితోడనొండెఁ-గొట్టిరేని॥ ౧౧౩॥

ఆ. ఆవుదానఁజాక-జీవించియున్నను।
బాతమదియెమఱియుఁ-జేతిపాడువు।
బొటనవ్రేలులావు-పొసఁగునాకులుగల।
పచ్చిరివటఁదోల-వలయునాల॥ ౧౧౪॥

గీ. మున్నుముసరునఁబసచెడి-యున్నపసర।
మేటిఁదినిసొమ్మసిలిలేచి-యేడునైదుఁ।
బదియునడుగులునడచిన-వారిఁగొన్నఁ।
గసవుమెసవిననిష్కృతుల్-గలుగవెపుడు॥ ౧౧౫॥

సీ. మొదవుగర్భంబైన-మొదటిపక్షముదాఁక,
పిండంబనియునెల-నిండువఱకు।
సమ్మితమనియుమా-సములాఱుదనుకన,
చేతనంబనియుస-చేతనంబు।
నాపైననియుఁగల-వాలచూళ్ళవియడం,
చినఁబ్రాజాపత్య-మునఁగ్రమముగఁ।
బాతికసగముము-ప్పాతికపూర్ణమిా,
విధినిష్కృతులునెర-వేర్చిమఱియు।

గీ. నొడలుగడ్డముపిలకను-విడిచిజుట్టుఁ।
గూడఁగ్రామమొప్పగొరిగించు-కొనివరుసను।
మంచిపంచలచాపునుఁ-గంచుపాత్ర।
మెద్దుగోమిథునముదాన-మీయవలయు॥ ౧౧౬॥

చ. తలమొలకాళ్ళుసేతులుయ-థావిధినేర్పడితల్లిపొట్టలోఁ।
పలఁదిరుగాడులేఁగనుగ్ర-పారహితుండయిచంపెనేనినా।
పలువకుగోవ్రతద్వయమ-వశ్యమునిష్కృతితప్పదింకఁగ।
ఱిలుఁగొనియుండెగోవులను-బాలనునొండెనుగొట్టెనేనియున్॥

గీ. కొమ్మువిఱిగినఁబాతిక-నెమ్మువిఱిగ।
నేని సగమునుజెవియూడె-నేనిమూఁడు।
పాతికలుమఱియును సేలఁ-బడిననంత।
యనుధరిత్రిఁబ్రాజాపత్య-మొప్పఁజేయ॥ ౧౧౭॥

గీ. కొమ్మెముకనడ్డివిఱుఁగంగఁ-గొట్టఁబడ్డఁ।
బిదపనాల్గునెలలావుజీ-వించెనేని।
హత్యకుఁదగుబ్రాయశ్చిత్త-మనవసరము।
మఱియుగోవ్రతమొనరించు-మానవుండు॥ ౧౧౮॥

ఉ. గాయములందెవుల్గొనిన-కాయమునన్‌జమురింకఁబూయుచున్।
హాయిగమేనుపూటువడు-నంతకులెస్సఁగమేపిగోవుఁగొం।
పోయిధరామరోత్తముని-మోక్షలనతుండయివీడుటొప్పుఁద।
తొక్కయమునిండకుండినయ-థావిధినిష్కృతిసాముచేవలెన్॥

ఆ. అచ్చుఁబోయుటొండె-నందులకొఱకుగు।
త్రిడుటయొండెలేని-యెద్దుమీఁద।
బలువులొత్తిదించు-టలుత్రాలఁగాపాడఁ।
గట్టివేయుటలునుఁ-గాదుతప్ప॥ ౧౨౧॥

ఉ. మిక్కిలి గాల్చినందులకు-మిక్కిలిబర్వులు వైచినందుకున్।
ముక్కునుఁ జించినందులకు-మోటుతనంబునఁగట్ల నేశ్వలోఁ।
జిక్కఁగఁదోలినందులకు-శిక్షక్రమమ్మున నాల్గుపాళ్లయం।
దొక్కటిరెండుమూఁడుకొ ఱ-యొక్కటిపూర్తిగఁ జేయఁగావలెన్॥

సీ. కఱ్ఱతో మొదవునుఁ-గడతేర్చినట్టైన,
సాంతపనంబుఁదా-సలుపవలయు।
మంటిబెడ్డల నావు-మనికితమార్చిన,
నొనరఁ బ్రాజాపత్య-మొనయవలయు।
ఱాళ్ళ చేకొనిగిడ్డి-ప్రాణంబుఁ దెగటార్పఁ,
దప్తకృచ్ఛము సేసి-తనరవలయు।
సాధనంబునగోవు-జక్కడంచినవతి,
కృచ్ఛంబు చేశుద్ధి-యొనయవలయు।

గీ. దప్తమునకెన్నిదైదు సాం-తపనమునకు।
నొనరమూఁడు ప్రాజాపత్య-మునకుఁబదియుఁ।
మూఁడునతికృచ్ఛమునకిట్లు-మొదవులుగొని।
దానమిచ్చుటశాస్త్రవి-ధాయకంబు॥ ౧౨౩॥

క. పెఱవారిజంతువులఁదాఁ।
బఱిమార్చిన వేఱొకండు-బదులొండెను లే।
కరసితగుపణమునొండెను।
మఱియావలెఁదప్పదనుచు-మనువచించెన్॥ ౧౨౪॥

గీ. కట్టిపెట్టినయెద్దిల్లు-గాలి చచ్చె।
నేనియుఁబరాశరునిమత-మూనికృచ్ఛ।
మందుఁబాతికపాలుగృ-హస్థువిడక।
సలుపఁగావలయునుయథా-శాస్త్రఫణితి॥ ౧౨౫॥

క. కొట్టుటయును మెడఁబలువుం
బెట్టుటయునుఁ బస్తుఁగట్టి-పెట్టుటయును బెం
గట్టులఁదోలుటబరువుం
గట్టుటయును నాలఁజంపఁ-గాఁగారణముల్॥ ౧౨౬॥

గీ. జనుము బెంకాయపీచుముం-జయును నూలు
గొనియొనర్చిన త్రాఁడుతో-గోలుసుతోడఁ
గట్టుటొప్పదు కట్టిన-గట్టిగొడ్డ
లొకటి చేఁబూనికని పెట్టి-యుండవలయు॥ ౧౨౭॥

ఆ. దర్భత్రాళ్ళు రల్లు-త్రాళ్ళు చేఁగొనిదక్షి
ణాభిముఖముగాఁగ-నాలఁగట్టు
టొప్పునట్టి త్రాళ్ళ-నిప్పుకల్ పురిగొని
తగులువడినఁగూడఁ-దప్పులేదు॥ ౧౨౮॥

గీ. మఱియు నా త్రాళ్ళ నెద్దేని-మంటయుండి
తగులువడెనేని గాయత్రిఁ-దగజపింప
వలయునద్దానదోషముల్-దొలఁగిపోవు
దీనగోవధ్యపాప మె-ద్దియును లేదు॥ ౧౨౯॥

క. బావులనునూతులుం డెడు
తావులఁ మ్రాఁకులనుడుల్చు-తావులనిడుటల్
గోవులనుదినెడివారికిఁ
దావిలుచుటలాలవధకుఁ-దగుపాపంబుల్॥ ౧౩౦॥

సీ. అచ్చుఁబోసినయప్పుఁ-డాఁబోఁతుఁబూజించి,
పరువులెత్తించున-ప్పట్టులందు
నెడఁదఘోనియుఁజెవి-యేనియుఁగడుపేని,
వ్రక్కలైననునూతఁ-బడినదాని

వెడలించు వేళల-మెడ కాళ్ళు విఱిగిన,
ట్టయిననుగృచ్ఛ్రంబు-నందుమూఁడు।
భాగంబులొనరింప-వలయునుబసరముల్,
దాహంబుఁగొనినీరుఁ-ద్రాగుకొఱకు॥

గీ. లోతునూతులఁజెఱువుల-లోనునదుల।
నానకట్టులలోదిగి-యందుఁజచ్చె।
నేనియజమానునకునింత-యేనిదోష।
ముండ నేరదు వెరచుట-యొప్ప దెపుడు॥ ౧౩౧॥

మ. పరమార్థంబుగ నేటిగట్లు చెఱువుల్-బావుల్ ధరంద్రవ్వ నా।
తురతన్ గోవులువచ్చి దానఁబడినన్-దోషంబు లేదిండ్లలోఁ।
దిరుగాడందగుత్రోవలందుఁబశువుల్-దీపించుస్థానంబులన్।
మఱిగొట్టంబులగోతులిడ్డపశువుల్-బడ్డంతఁబాపంబగున్॥ ౧౩౨॥

సీ. రక్షణమునకుఁగా-రాత్రిళ్ళుకట్టంగఁ,
బడ్డయావులుచిచ్చు-వలనఁబాము।
వలననుబిడుగుల-వలనను బెబ్బులి,
వలనశత్రువులూరుఁ-బట్టినపుడు,
పఱపుబాణంబుల-వలననిల్ విఱుఁగుట;
వలనమహావృష్టి-వలనఁబోరు।
వలననిల్గూలుట-వలనదవానలం,
బలమియూరంటుట-వలనఁజాలు ॥

గీ. వెలికినీడ్చుటవలనఁదె-గులునుమాన్ప।
వాతయిడఁగోయఁగట్టుట-వలనఁబరమ।
పదము వేంచేసె నేనిఁద-త్స్వామికెట్టి।
పాపమునులేదు దైవదు-ర్భావమగుట॥ ౧౩౩॥

క. కట్టుటచేదిననీయక।
పెట్టుటచేతఁబలుపసులు-వెతఁగుందినచోఁ।
బట్టునఁదప్పినవెజ్జుని।
కట్టులుపాపంబుద్విగుణ-మాతనిఁజెందున్॥ ౧౩౪॥

క. ఆవులనుగోఁడెలనుజని।
పోవునెడంగనులఁజూచి-పోనిమ్మనుచుం,
గావఁగఁజనకుండిననఘు।
మావహిలుంజూచుచుండు-నందఱకునొగిన్॥ ౧౩౫॥

గీ. ఒక్కగోవునుబలువురు-నుక్కడంచి।
రేనిరాజాధికారులె-వ్వాని వ్రేటుఁ।
దగిలిపొలిసినవివరంబుఁ-దగువిధమున।
నరసివానికినిష్కృతుల్-జరుపవలయు॥ ౧౩౬॥

గీ. దైవవశమునఁబెక్కులొ-క్కావుఁగూడి।
బిలుకుమార్చిననందఱు-వేఱువేఱ।
నావుచావునకగుబరి-హారమునను।
నాలుగవపాలుసేసికొ-నంగవలయు॥ ౧౩౭॥

గీ. దెబ్బఁబడెనేనినెత్తుటఁ-దేలుచుండుఁ।
దెవులుఁగొనెనేనిదేహంబు-నవసియుండుఁ।
బాముకఱచినఁజొంగలు-వాతఁగారు।
నివియరసిచావునకుఁగత-మెఱుఁగవలయు॥ ౧౩౮॥

గీ. మేతమేయఁగవిడిచిన-మెసవకావు।
త్రోవఁబట్టుటవ్రేటుగు-ఱుగఁగొనవలె।
మహితశాస్త్రజ్ఞుఁడైనట్టి-మనువునిట్లు।
చేయుమనియెగోవధకుఁజాం-ద్రాయణంబు॥ ౧౩౯॥

గీ. నెత్తివెండ్రుకలుంచుకోఁ-జిత్తమున్న
నిమ్మడిగ నిష్కృతియును దా-నమ్ముసేయ
వలయు రాజును రాజపు-త్రులుఁ బ్రసిద్ధుఁ
డైనపాఱుఁడు వీరికి-య్యదినియమితి॥ ౧౪౦॥

క. కన్నియలును నైదువలును
నున్నఁగ గొఱిగించుకొనన-నువు కామినివా
రున్న తలవెండ్రుకలలోఁ
దిన్నఁగ రెండంగుళములు-దీయింపఁదగున్॥ ౧౪౧॥

చ. తలగొఱిగించుకొంటపరి-ధానము చర్మము దాల్చికొంటద
వ్వులను బసుండియుంట మొద-వుల్ జనవెంటవనాల నేళ్ళసం
ఘులఁ దిరుగాడుటల్ నిశల-దూరఁపుఁ గొట్టములన్వసించుటల్
నెలఁతలకొప్పవొక్క వ్రత-నిష్టయుచాలును పాపశాంతికిన్॥ ౧౪౨

గీ. మూఁడు వేళల స్నానంబు-మొనసి దేవ
తలను బూజించుటయుఁ జుట్టు-ములకు నడుమఁ
గృచ్ఛ్రచాంద్రాయణాది స-త్క్రియలొనర్పు
టయును నెలఁతలకుఁ దగు నిం-డ్లనవసించి॥ ౧౪౩॥

మ. ధరణిన్మానవుఁ డెవ్వఁడేని మొదవున్-దాఁ జంపి తత్కార్యమె
వ్వరికిం దెల్పక యుండఁగోరిన మహా-పాపాత్ముఁడాతండు భీ
కరకష్టావహ కాలసూత్రమున శి-క్షం బొందియామీఁద భూ
చరుఁడై షండుఁడు దుఃఖి కుష్ఠియగు మున్-జన్మంబు లేడెత్తెడున్॥

క. తనపాపము లీకారణ
మునఁ దెలుపుమఁ దగిన విధులు-పొనరించుచు గో
వనితాబ్రాహ్మణశిశు రా
డ్జనులయెడం గినుకలేక-చరియింపఁదగున్॥ ౧౪౫॥

నవమాధ్యాయము సమాప్తము.

శా. రంభాభోగసుఖాస్పదక్రతుసమా-రంభైకధీవిస్ఫుర!
జంభారాతిరమాతృణీకరణద-క్షస్ఫారముక్త్యంగనా!
సంభోగప్రదభూరితత్వపరమ-జ్ఞానానుసంధానప్రో!
జ్జృంభత్కర్మనిరంతరాయితజగ-జ్జేగీయమానాకృతీ!! ౧౪౬॥

క. దిక్కాంతోరోజలస!
త్సత్కోమలచందనకుసుమ-రారాజత్స!
మ్యక్కీర్తి వారిజాక్షీ!
దృక్కంజనుతోజవిమల-తేజోమూర్తీ!! ౧౪౭॥

గద్య. ఇది శ్రీ నిరుపమాన కరుణాసనాథ శ్రీసర్వమంగళానాథ
ప్రసాదాసాదిత సరసకవితావిహార రామలక్ష్మ్యంబా
బుచ్చివేంకయమంత్రీంద్ర కుమార శాండిల్యగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర సుకవిజనవిధేయ ప్రభా
కరనామధేయప్రణీతంబయిన శ్రీమదాంధ్ర
పరాశరస్మృతియను ధర్మశాస్త్రంబునందు
ద్వితీయబింబము సమాప్తము. శ్రీశ్రీశ్రీ.

శ్రీరస్తు.

శ్రీమార్కండేయేశ్వరాయనమః.

# ఆంధ్రపరాశరస్మృతి.

[తృతీయబింబము.]

---




మన్మార్కండేయ।

స్వామికృపామృతకటాక్ష-సంప్రాప్త కవి।

త్వామోదితవిద్వజ్జన।

భూమీశభుజంగరాయ-పుణ్యనికాయా॥

క. కాలములు నాలుగింటికిఁగా।
వలసిననిష్కృతులు వినుఁడు-వచియింతు ధరా।
తలమున నన్యస్త్రీలను।
గలసినఁ జాంద్రాయణంబుఁ-గావింపవలెన్॥ ౧౪౮॥

సీ. కోడిగ్రుడ్డంతేసి-గొప్పదౌకవణముల్,
బహుళపాడ్యమి నాఁడు-పదియునాల్గు।
తినవలె నామీఁద-దినమున కొకముద్ద,
నంతువఁ బైయమా-వాస్యదనుకఁ।

దగ్గింపవలెనాఁడు-తగనిట్టుపన్నెండి,
పిదపశుక్లప్రతి-పదమొదలుగఁ।
క్రమముగానొక్కొక్క-కడిఁబెంచవలయునీ,
వ్రతమచాంద్రాయణ-వ్రతమనంగ।

గీ. వ్రతమొనర్చినపిదపవ-స్త్రద్వయంబు।
గోయుగమొసంగిబాపలఁ-గుడిపివారి।
కొసఁగవలెదక్షిణలుముద్ద-కెసఁగుమితముఁ।
దప్పినఫలంబులేదుపా-తకమువనదు॥ ౧౪౯॥

మ. చనదంచెంబకబ్రాహ్మణుండితరుఁడై-చండాలినొండేని శ్వపా।
కినినొండేరమియించెనేనిద్విజప-ఙ్క్తింబిల్చివారొప్పన।
ట్లునిరాహారముమూఁడునాళ్లైనసిజా-ట్లుంగూడబోడించిని।
ష్ఠనుతాఁజేయవిధాయకంబగుబ్రా-జాపత్యయుగ్మంబొగిన్॥

గీ. ఇంతయేగాకపాఱుల-కీయవలయు।
నావొకటిఁగోఁడెయొకటియు-నందుపైన।
దక్షిణయునిట్లొనర్పఁబా-తకమువాసి।
జన్నిగట్లొప్పననిపరా-శరుఁడుసెప్పె॥ ౧౫౧॥

క. రాజునుగోమటియునునీ।
యోజంజెండాలినెనయ-నొనరింపవలెం।
బ్రాజాపత్యయుగముగో।
రాజద్వయగోద్వయస్థ-రద్దానంబుల్॥ ౧౫౨॥

గీ. వసుధఁజండాలినేని శ్వ-పాకినేని।
నెనయఁగాఁబ్రాజాపత్య-కృచ్ఛ్రమునునో।

చండాలి=శూద్రునివలన బ్రాహ్మణస్త్రీయందుఁబుట్టినది.
శ్వపాకి=క్షత్రియునివలన నుగ్రజయందుగలిగినది.

నర్చి నాలుగుగోవులు - నాల్గుకోఁడె।
లియ్యవలె దానమును శుద్ధి - యొసఁగుకొఱకు॥ ౧౫౩॥

సీ. తనుగన్న తల్లినిఁ - దాఁగన్న బిడ్డను,
దనకుఁ దోఁబుట్టువై - తనరుదాని।
నెఱుఁగక రమియించె - నేని నాతఁడు త్రికృ,
చ్ఛ్రములను జాంద్రాయ - ణములు మూఁడు।
చేసి శిశ్నమును గో - సికొనంగఁ దానఁబా,
తక మేగు నెఱిఁగియుఁ - దల్లియప్ప।
చెల్లెండ్రితోఁ బొత్తు - సేసినవాఁడును,
బుల్లచ్ఛేదించుకోఁ - జెల్లునదియ।

గీ. దానెఱుంగకయొనయఁ జాం - ద్రాయణద్వ।
యము సలిపియాలఁ బది వృష - భములఁ బదియు।
దానమొనరించె నేనిన - ద్దానఁ బాప।
చయము చనునని యెనుపరా - శరమహర్షి॥ ౧౫౪॥

సీ. పినతండ్రి పెదతండ్రి - పెండ్లాములను గన్న,
తల్లి నెచ్చెలిని సో - దరునిఁ గూఁతు।
వాని యిల్లాలిని - మేనమామ కళత్ర,
మును దీర్థపత్నినిఁ - బుత్రు భార్యఁ।
దన యింటి యాడబి - డ్డను గూడు నధముఁడు,
మూఁడు ప్రాజాపత్య - ములను జేసి।
గోవును గోఁడెయు - నీవలె దక్షిణ,
యిట్లొనర్చినఁ బాప - మీఁగు నరుఁడు।

గీ. పశువుఁ గలసిన గేదెపైఁ - బాతిన వెల।
వాతిఁ బొందినఁ బందినె - నసిన నొంటె।

ననుగమించినగాడ్దె నే-గిననుగోతిఁ।
బొత్తుఁగిసినఁ బ్రాజాపత్య-ముసలుపవలె॥ ౧౫౫॥

గీ. మొదవుఁగూడినబాపఁడు-మూఁడునాళ్ళు।
పస్తునొక్కావుఁదానంబు-వలయుఁజేయ।
నొక్కపరిగెదెగాడిదె-నొంటెఁగూడి।
యున్నచోనొక్కదినముని-ట్రున్నశుద్ధి॥ ౧౫౬॥

గీ. మారిముసరినవేళ క్షా-మంపువేళ।
మాఱుటొత్తినవేళ స-మరము వేళ।
భయఁపడినావేళఁబొలతులఁ-బట్టువేళ।
భర్తలెల్లరునాంక్రేఁగా-పాడవలయు॥ ౧౫౭॥

క. అంగీకరించిమాలని।
చెంగటనివసించినట్టి-జెఱభిద్విజులవే।
సాంగజ్ఞులపదుగురిలో।
భంగము శ్రుతపఱచుకొనఁగ-వలయునుమొదటన్॥ ౧౫౮॥

సీ. అటుపైనవారియా-జ్ఞాధారమునగొంతు,
బంటినూతినిఁబేడ-బాడినించి।
యందొకనాడుని-రాహారముగనుండి,
వెలువడిమరునాడు-తలవపనము।
మొదలంటఁజేయించి-పిదపయవాన్నంబుఁ,
దినిపస్తుతో మూఁడు-దినములుండి।
నాల్గవనాడుకం-ఠప్రమాణమునీట,
నవసించియైదవ-నాడుశంఖ।

గీ. పుష్పలత్నయాకువేఱును-బువ్వపండు।
బంగరువుఁబంచగవ్యంబు-వైచికాచు।

నుదకమునుగొనిమరునాడు-మొదలుముట్టు।
వడుదనుకనొక్క-పూటయే-గుడువవలయు॥ ౧౫౯

గీ. ఈవ్రతముపూర్తియగుదాఁక-నింటరాక।
వెలుపలనయుండవలయుని-వ్విధియొనర్చి।
మీఁదబాపలఁగుడిపియా-మీఁదనొక్క।
యావుఁగోఁడెయుదక్షిణ-వీవలయును॥ ౧౬౦

క. ఇలయును నెలఁతయుసమమి।
ష్టులఁజాంద్రాయణముఁగృచ్ఛ్ర-మును జేసినచోఁ।
గలిపికొనుటొప్పనాలుగు।
కొలములపొలఁతులనుదగదు-కొంచగనెపుడున్॥ ౧౬౧

క. కట్టియుఁగొట్టియునుంజెఱఁ।
బట్టియుభయపెట్టికరముఁ-బట్టిచెరపినన్।
నెట్టనవ్వనితకుశుచి।
పుట్టునుసాంతపనకృచ్ఛ్ర-ముననిశ్శంకన్॥ ౧౬౨

గీ. వాంఛలేకుండియునునొక-పరిదురాత్ము।
చేతభోగింపఁబడినట్టి-స్త్రీబహిష్ఠఁ
గనుటవలనఁబ్రాజాపత్య-మునుసలుపుట।
వలననుబవిత్రయగునని-తెలియవలయు॥ ౧౬౩

క. కలుదారివుదానిమగనియొ।
డలుసగమఘమయమగుటఁబు-డమినాతఁడుని।
స్తులగాయత్రిజపించుచుఁ।
బొలుపుగసాంతపనకృచ్ఛ్ర-మునుసల్పవలెన్॥ ౧౬౪

గీ. ఆవుపంచితమావుపా-లావునేయి।
యావుపేడావుపెఱుఁగుద-ర్భాంబులాఱు।

నాళ్ళుక్రమమునఁదినియొక్క-నాడునిట్టు।
నుంటయేసాంతపనకృచ్ఛ్ర-మొప్పుజగతి॥ ౧౬౫॥

చ. పతిచనిపోయినప్పుడును-వ్యక్తముగానిప్రవాసమేగిన।
పితరునియందుఁజూలయిన-నింతిఁబురిన్వెడలించుటొప్పుఁబా।
అతపెరవానిఁగూడిపెర-ప్రోలునకుంజనెనేనియట్టిదు।
ర్మతిఁబురినష్టనాఁదెలిపి-క్రమ్మరరానియఁగూడదింటికిన్ ౧౬౬॥

గీ. మాఢ్యముననొండెమిగులఁగా-మముననొండెఁ।
బతినిసుతులనుజుట్టల-వదలియన్య।
దేశమునకేఁగునట్టియిం-తియునునష్ట।
యగుచుఁబరమునమిగులని-హమునఁజెడును॥ ౧౬౭॥

గీ. ఎద్దియేనియునపచార-మెఱిఁగిమగఁడు।
మొత్తఁగానేకతమలేచి-యొత్తిగిలిన।
పడతియుడుకారనింటికి-వచ్చెనేనిఁ।
జేర్చికొనవచ్చునిర్దయ-సేయరాదు॥ ౧౬౮॥

ఉ. నారిమోఱంగిచన్నపది-నాళ్ళకులోపలఱంకులేకయి।
స్వైరిణదానినిష్కృతులు-లేకగొఱందగునద్దియుండినన్।
దూరముసేయుటొప్పనటు-దూరముసేయకయుంచికొన్నవా।
రారసికృచ్ఛ్రముంబతిత-దర్థముజుట్టలుసేయఁగావలెన్॥ ౧౬౯॥

గీ. అట్లొనర్పనివారింటి-కరిగియచటఁ।
దిన్నఁద్రాగినవారొక్క-దినముపాస।
ముండవలెనట్లుచేసిన-నుండుపాత।
కమునశించునుశుద్ధియుఁ-గడలుకొనును॥ ౧౭౦॥

చ. పెనిమిటికొట్టఁగానొమఱి-పెంకితనాననొలేచిపోవుబా।
పనదదియెంతవేఱొకనిఁ-బట్టకయున్ననుఱంకుటాలుగాఁ।

గొనివిడువంగఁ జెల్లుబాజు - గుం గొనియల్లదిచేర నేని వేఁ
జనుపతియిల్లుతల్లియిలు - జారునియిల్ల పవిత్రమైకడున్॥ ౧౨౧॥

సీ. అట్టియిండ్లసద్రవ్య - యామీఁదఁ బంచగ,
వ్యము జల్లిమట్టిభాం - డములుపాఱ।
వైచికట్టవిమున్న - పలికినగతిశుద్ధి,
చేయించి టెంకాయ - చిప్పలావు।
తోఁకనీటనుగడ్గి - తోడ్తోడఁ దామ్రంపు,
వస్తువుల్ పులుసునఁ - బంచగవ్య।
మున లెస్సమార్జించి - బూడెదతోఁ గంచు,
పాత్రముల్పదిమార్లు - బాగుజేసి॥

గీ. పిదపఁ బాఱులు చెప్పెడు - విధమువలనఁ।
బూతు - డైయింటిపెద్దగో - వునువృషభము।
దక్షిణయొసంగియాపైనఁ - దానొనర్ప।
వలయు రెండుప్రాజాపత్య - ములుక్రమమున॥ ౧౨౨॥

గీ. తద్గృహమునందునుండుని - తరులునొకది।
నంబుపవసించిపంచగ - వ్యంబుఁ గొన్న।
శుద్ధిఁ గాంతురు మఱియుఁ బ్ర - సిద్ధముగను।
వారితో వ్యవహరించెదు - వారలెల్ల॥ ౧౨౩॥

మ. ఉపవాసంబును స్నానమున్ వ్రతము సం - ధ్యోపాస్తియున్
వేప్రిమ్రియున్।
జపమున్ దైవతపూజ మంత్రమునుయ - జ్ఞంబుం దపశ్చర్యయుం।
గృపయున్ దానము వీనియందొకటియొ - ద్దేనిన్ యథాశక్తిఁ జే।
సి పునశ్శౌచముఁ గాంచవచ్చుఁ గడుతు - ష్టింబుష్టియున్ సంధిలన్॥

గీ. యజ్ఞములయందుఁ జమసము - లట్టులచటి।
యాకసము గాలియునుదర్భ - లగ్గియూట।

నీరువీనిక శుచిగల్గ-నేర జెప్ప।
డట్లగుటిశుద్ధివానికి-ననవసరము॥ ౧౭౫॥

దశమాధ్యాయము సమాప్తము.

## ఏకాదశాధ్యాయము.

గీ. మైలయన్నంబు రేతస్సు-మాలయన్న।
మావునంజ్యుఁడుఁ దిన్న బ్రా-హ్మణుఁడు సేయ।
వలయుఁ జాంద్రాయణము రాజు-బమ్మునందు।
సగముపాలుఁ బ్రాజాపత్య-మొగినిఁ గాఁపు॥ ౧౭౬॥

గీ. పైనికొలములుమూఁడును-బ్రహ్మకూర్చ।
మవరవర్ణుఁడు పంచగ-వ్యమునుబిపఁ।
గొనియొకటిరెండుమూఁడునా-ల్గునుక్రమమున।
గోవులీవలె నాలుగు-కొలములెలమి॥ ౧౭౭॥

క. తినఁగూడకున్న మైలల।
సెనసినఁ గాపింటిదైన-నెంగిలిదైన।
న్నసమనుమానించినశా।
స్త్రనిషిద్ధంబయిన నోగి-రముఁ జనదు తినన్॥ ౧౭౮॥

గీ. ఎఱిఁగియేనియు నెఱుఁగక-యేనిఁ దిన్న।
బ్రాహ్మణుఁడు కృచ్ఛ్ర మొనరించి-బ్రహ్మకూర్చ।
మునను శుచిఁగనవలె బిడ్డ-ముంగిపిల్లి।
తిన్నఁగుశవారినన్న శు-ద్ధియగు నిజము॥ ౧౭౯॥

ఉ. బంతినిఁ జాఱువారుగుడు-వంగఁ దటాలున నొక్కఁడందులో।
వింతగ లేచినం గొదమ-విస్తరు లెంగిలియట్లుగానసా।

బంతిఁగలట్టివారు కుడు-వంజనదొక్కఁడఁదిందు రేనిఁద।
చ్ఛాంతికిఁ జేయఁగావలయు-సాంతపనంబను కృచ్ఛ్రమిమ్ములన్॥

సీ. తెల్లవంకాయయుఁ-దెల్లయుల్లియునునీ,
రుల్లిగృంజనమును-నొంటెపాలు।
లేడిపాలును నేల-తాడియు దేవుని,
నేలపంటయు జున్ను-పాలుమ్రాఁకు।
జిగురు నెఱుఁగక భ-క్షించిన ద్విజులెల్ల,
మూఁడునాళ్ళుపవాస-మున నెసంగి।
పంచగవ్యముఁ గొన-వలె శుద్ధికొఱకు బ్రా,
హ్మణుఁ డెఱుంగక కప్ప-మాంస మొండె।

గీ. నెలుకమాంసము నొండె నొ-క్కొంతఁదిన్న।
నదియెఱింగిన పిదపయు-వాన్న మొక్క।
పవలు రాత్రియుఁ దిని శుద్ధిఁ-బడయవచ్చు।
దీననావంత యేనిసం-దియము వలదు॥ ౧౮౧॥

శా. శౌచాచారగరిష్ఠమైన నృపవా-సంబందు బచ్చింటసం।
కోచంబందక దైవపైతృకములం-గోరస్సదాయగ్రజా।
నూచానుల్ దినుటొప్పగున్ జమురునం-దుంబాలతోఁగాఁపుచే।
వ్రేచంబడ్డ పదార్థముల్ నదులకు-న్వ్వొంచేసి బోసేవలెన్॥ ౧౮౨॥

చ. అనిశము మద్యమాంసరతుఁ-డై రథచోదకవర్తనాదిజీ।
వనుఁడగు నీచశూద్రుని శ్వ-పాకునియట్లుఁ ద్యజించుటొప్పు నె।
మ్మనమునఁ బాఱులంగొలిచి-మాంసముకల్లును మానిస్వీయక।
ర్మనిరతుఁడైన శూద్రుని ధ-రం ద్యజియించుటయొప్ప దెప్పుడున్॥

గీ. వర్ణములు నాలుగింట నె-వ్వరికి నేనిఁ।
బురుడు మైలయు వచ్చిన-ప్పుడు తదీయ।

గృహమునందగ్రజుఁడుతన-కెఱుక లేమి।
నెగితిన్నఁ బ్రాయశ్చిత్త-మెట్టులనిన॥ ౧౨౪॥

గీ. ఎలమి గాయత్రిజపియింప-వలయు నెనిమి।
దైదుమూఁడును వేలిల్లు-పొదజునిది।
వైశ్యునిది రాచదైన బా-పనదియేని।
రెండు వేలట్లు సేసిన-నొండెలేక॥ ౧౨౫॥

గీ. సామవేదమునందలి "వామదేవ్య"।
మనెడుబుక్కఁక పరిచది-విననునొండె।
సూతకాన్నము భుజియించు-పాతకంబు।
నగ్రజుఁడు వాసి పావనుం-డగు నిజంబు॥ ౧౨౬॥

శా. కాఁపింటంగలయావుపాల్బుమురు శు-ష్కంబైనబియ్యంబునున్।
బాపల్బాపనయిండ్లవండితినుటల్-మాబాగు కాఁపింటవా।
రాపత్కాలమునందుఁదిన్న "ద్రుపదా"-యన్ బుక్కృతంబున్నన।
స్తాపంబుండగఁజేసినట్లయిన శౌ-చప్రాప్తి చేకూరెడున్॥ ౧౨౭॥

క. నాపితదాసాన్నంబులు।
గోపాలాన్నంబు మఱియుఁ-గులమిత్రాన్నం।
బాపయినర్ధికునన్నము।
సాపడఁగావచ్చు శాస్త్రి-సమ్మతమగుటన్॥ ౧౨౮॥

గీ. కాఁపుపూఁబోడియందున-గ్రజునివలనఁ।
గలిగి సంస్కృతుఁడైనవాఁ-డిలను దాసుఁ।
డనియు సంస్కారములు లేని-యతఁడు నాపి।
తుండనియుఁ బేర్కొనంబడు-దురు మఱియును॥ ౧౨౯॥

గీ. అవనిభర్తకుఁ గాఁపుటి-ల్లాలునందు।
జననమొందినవాఁడు పే-రునకుగొల్ల।

వాఁడయినవానిగృహమున-బ్రాహ్మణుండు।
సాపడుటలెస్సయొప్పని-స్సంశయముగ॥ ౧౯౦॥

క. చిరకాలమిత్రుఁగునుసూ।
దరవనితకుబచ్చువలన-ధరఁబుట్టినవాఁ।
డరయఁగఁగులమిత్రుండగు।
మఱియుంబాఱునకురాచ-మానినివలనన్॥ ౧౯౧॥

క. జననంబొందినవాఁడా।
త్మని వేదకుఁడయ్యెబచ్చు-మగువవలనఁబా।
ఱునకుఁబోడమిసంస్కా-రము।
లెనసినవాఁడర్థికుఁడని-యెఱుఁగంగఁదగున్॥ ౧౯౨॥

గీ. వీరిగృహములయందెల్ల-విప్రవరుఁడు।
మెసవఁదగుదీనశంకయే-మియునువలదు।
తగనికడవలఁబాల్నీరు-దధిఘృతంబు।
నెఱుఁగకభుజించినవిరుగు-డెట్టులనిన॥ ౧౯౩॥

శా. బాపల్ గాఁజులుబచ్చువారుధరణిన్-బైపాపముంజేసినన్।
శేపుస్నాపుపవాసమున్సలిపియ-ర్థిన్బ్రహ్మకూర్చోదకం।
బాపైఁజేకొనుటొప్పునిప్పనికనా-హారంబులేదివ్వియే।
బాపుంబాపముకాఁపువానికదిస-ల్పంగాఁదగున్నిచ్చలున్॥

గీ. బ్రహ్మకూర్చనిరాహార-ఫలములాశ్వ।
పాకశుచిఁజేయునావుపా-ల్పంచితంబు।
దధిఘృతముగోమయముకుశో-దకములెనసి।
పంచగవ్యంబగునునిది-పాపహరము॥ ౧౯౫॥

క. నలుపుతెలుపుపసపెఱుపుం।
బులుపుంగలయాలమాత్ర-ముపురీషఘృత।

మ్ములు నేయి పాలు యోగ్య।
మ్ములనవి యొదవమి నిపచ్చ-మొదవు వియొదగుఁ॥ ౧౯౬॥

గీ. ఒకపలము నేయి పంచితె-మొకపలంబు।
మూఁడుపలముల పెఱుఁగు పా-లేడుపలము।
లొకపలము దర్భజలము గో-ల్తనసగంబు।
బొటనవ్రేలంత పేడయుఁ-బోలుఁగలుప॥ ౧౯౭॥

క. మునుగోమూత్రము గాయ।
త్రినిఁబిదపం దర్భనీళ్ళు-"దేవస్యత్వా"।
యని పెఱుఁగు "దధిక్రాణ్ణో"।
యని "యాప్యాయస్వ" యని ప-యస్సుఁగొనవలెఁ॥ ౧౯౮॥

క. పసుపడ "గంధద్వారా"।
మని "శుక్రమసి" యని పేడ-యాజ్యముఁగొని ని।
ప్పునని డి "యాపోహిష్ఠా"।
యనుచుం గలుపంగవలయు-నవియా వెనుకఁ॥ ౧౯౯॥

క. "మానస్తోకే" యనుచుఁ।
దానినిమంత్రించి కొనలు-తరగని చిల్క-౦।
బోనికుశలేడు కుంగొఱ।
కానట్లులు గొని హుతమ్ముఁ-గావింపవలెఁ॥ ౨౦౦॥

క. "శస్త్రేదం విష్ణుర్త్వా।
నస్తోక ఇరావతీ" య-నఁ "శంమ"నఁగా।
నిస్తుల "శంనో దేవ్యా"।
దిస్తుతులఁ హుత మొనర్చి-తీరిన పిదపఁ॥ ౨౦౧॥

క. హుతశేషంబును బ్రాహ్మణ।
తతి తాఁ త్రివర్ష్వలయు మఱియుఁ-దలుచు నెడలఁదా।
వృతతిఁగలు ఫునప్పుడు నె।
త్తుతతిఁ బ్రణవంబు జప్తి-తోనుడువవలెఁ॥ ౨౦౨॥

చ. పెఱుఁగున నేతియందు మఱి - పేడను బాలునఁ బంచితంబునం
గరువలి యర్కుఁ డగ్నియును - గ్లావరుణుల్ వసియింద్రుఁ గావునన్
ధరణినిఁ బంచగవ్యమఘ - నాశకమింధనమగ్ని మంటల
ట్లరయుచు బ్రహ్మకూర్చము త్వ - గస్థిగతాఘము లేర్చి పేర్చెడున్
గీ. కుడుచుచుండఁగఁ బెదవుల - గుండ జారి
పాత్రమునఁ బడ్డనీరు త్రా - వంగఁ జనదు
త్రాగినట్లైన వారు చాం - ద్రాయణంబు
చేయవలయును దురితంబు - వాయుకొఱకు ౨౦౪
చ. ఎముకలు తోళ్ళు నానినను - నేనుఁగు సింహము నొంటె యెల్గు ఖ
డ్గము గవయంబు నుంగణుజు - గాడిదె బెబ్బులి కోతి కుక్కన
క్క మనుజుఁడున్ మయూరి కిటి - కాకియుఁ జచ్చిన నూతులందటన్
కములను దూపగొంట యవ - గాహము సేయుట తప్పు చేసినన్
గీ. బ్రాహ్మణుఁడు రాజు కోమటి - పాదజుండు
మూఁడు రెండును నొకదిన - మును గ్రమమున
నొక్కపూటయు నుపవాస - ముండవలయు
దోషమోక్షంబు దమకెల్ల - దొరకుకొఱకు ౨౦౫
క. పరపాకనివృత్తాన్నము
పరపాకాన్నంబు మఱి య - పచునన్నమునై
వ్వరుఁ దినఁగూడదు తిన్నన్
సరగునఁ జాంద్రాయణంబు - సలుపఁగవలయున్ ౨౦౬
గీ. అపచునకు దానమిచ్చిన - వ్యర్థమగుట
యంతయే గాక యిచ్చిన - యతఁడు మఱియుఁ
బుచ్చుకొన్న యతండును - బోలుపుదక్కి
నరకమునఁ గూలుదురు నిజ - మరసి చూడ ౨౦౭
చ. పరిణయవేళఁ గొన్నహుత - భక్షకు నాత్మవహించి పంచయ
ధ్వరములు సేయకున్నఁ బర - పాకనివృత్తుఁడు వాఁడు జేయుచుం

బరభృతుఁడైన వాఁడు పర-పాకరతుండు గృహస్థుఁడైనిజో।
దరము భరిలిచి దాత్మతయ-దాల్చని వాఁడపచుండు నాఁబడున్॥

క. ఆయా యుగములమాఱుడు।
నాయా యుగధర్మములను-నయ్యయ్యెడలం।
జేయుచు యుగరూపులుదా।
మైయుండెడు ద్విజుల నేమి-యనఁదగ దెవరున్॥ ౨౧౦॥

చ. అపచారర్గ బనియెంచ "కూ" యనుచుం బ్ర-హ్మజ్ఞానిహింసించు వాఁ।
డపవిత్రుండయి నీవునీవనుచు వి-ద్యావృద్ధులం బల్కు-వాఁ।
డపుడే స్నానము సేసి రాత్రివరకా-హారంబు వర్జించి స।
త్కృపయా మాంహి భవాన్నపస్యతునమ-స్తేయంచు వేడందగున్॥

గీ. అట్టివారినిఁగసవుతోఁ-గొట్టదఁగదు।
బట్టపీలిక మెడయందుఁ-గట్టఁదగదు।
బలువివాదించి వారిని-గెలువఁదగదు।
చేసినను మ్రొక్కి-ప్రార్థన-సేయుటొప్పు॥ ౨౧౨॥

గీ. కొట్టనుంకింపనొకదిన-మట్టె నేల।
మెట్టినను మూఁడు దినములు-గట్టిపస్తు।
నెత్తురొలికిన నతికృచ్ఛ-ముత్రవేటు।
తగిలి కదు పైనఁగృచ్ఛంబు-తగునొనర్ప॥ ౨౧౩

క. దినమునకుఁ బట్టెడిన్నముఁ।
దినుచుండొమ్మిదిదినాలు-తీరినపిదపన్।
దినములు మూఁడుపవాసం।
బెనసినవనతికృచ్ఛమనుచు-నెఱుఁగంగఁదగున్॥ ౨౧౪॥

క. ఈపైఁ జెప్పిన నానా।
పాపములకు మేళనంబు-ప్రాప్తముకాఁగా।
నాపాపంబుల నెల్లను।
బాపున్ గాయత్రియొక్క-పదివేలయినన్॥ ౨౧౫॥

## ద్వాదశాధ్యాయము.

---

గీ. చెడ్డకలఁగన్న వపనము-సేసికొన్నఁ
గాంతరమియుంచినను వల్ల-కాటిపోగను
మూర్ఖానినడోకుకొన్నను-మొనసిస్నాన
మాచరింపఁగవలయుశా-స్త్రానుసరణి॥ ౨౧౬॥

క. మలమునుమూత్రముమఱియుఁ
గలుత గిలినయోగిర మెఱుఁ-గకపాలులు రా
జులు కోమటులు దినినవా
రలకుమఱలవడుగునవస-రముతలఁపంగన్॥ ౨౧౭॥

క. దండము మొలత్రాఁడజినము
వెండియుఁ వ్రతములును భిక్ష-ద్విజులకు నెందున్
రెండవయుపనయనములకు
నుండంబని లేదు లేక-యొనరింపఁదగున్॥ ౨౧౮॥

క. మలమూత్రంబులు తాకిన
మలినాన్నముఁదిన్న మూఢ-మతినిష్కృతికై
యిలఁ బ్రాజాపత్యంబును
వెలయింపఁగవలయునట్లు-వెలయించిబడిన్॥ ౨౧౯।

గీ. పంచగవ్యంబుతో స్నాన-మంచితముగఁ
జేసియద్దానిఁ బానంబు-సేయవలయుఁ
జేసినట్టైనఁ బరిశుద్ధిఁ-జెందవచ్చు
సంశయము లేదిదియెపరా-శరమతంబు॥ ౨౨౦॥

క. చేటుంబోరయుటకైగిరి
కూటాగ్రమునుండిదుమికి-గుడువకయగ్గిన్

నీటంబడి ప్రస్థానము। ౨౨౧॥
పాటించియుమలినవచ్చు-వారెల్లరకున్॥

శా. ఆపాపంబుల కెల్ల నిష్కృతులు నె-ట్లన్నన్ గృచ్ఛ్రముల్ రెండు ప్రా।
జాపత్యంబులు సేయఁగావలయు నై-శ్య వ్రాతముం బుణ్యగో।
త్రాపుణ్యాచల పుణ్యతీర్థములయా-త్రల్ సేయవిధ్యుక్రమా।
గాఁ బుల్ గోపశకంబునున్ వృషభమొ-క్కండియ్యఁగా
నొప్పగున్॥ ౨౨౨॥

గీ. విపినమున నాల్గుత్రోవలు-వెలయుచోటఁ।
జుట్టు నుంగూడఁ దలబోడ-గొట్టుకొనుచు।
నిలను రెండు ప్రాజాపత్య-ములనుఁ జేసి। ౨౨౩॥
గోమిథునమియ్యఁ బాఱున-కుఁ దగు శుద్ధి॥

సీ. ఆగ్నేయమనియు బ్రా-హ్మణమనియును దివ్య,
మనియును వాయువ్య-మనియు వారు।
ణంబని యైదు స్నా-నములు పవిత్రంబు,
లందులోన విభూతి-యలదుకొనుట।
పుడమి నాగ్నేయ "మా-పోహిష్ట" యని నీరు,
పైఁజల్లుకొనుటది-బ్రహ్మమెండఁ।
గాఁగు నీటను నవ-గాహంబు దివ్యమం,
డిది దేవగంగతో-నెనయఁజాలు।

గీ. ప్రొద్దుగుంకెడు వేళ నా-వుల గొరిజల।
వలన నెగసిన ధూళి పై-పాఱుటదియు।
నవని వాయవ్యముదకంబు-నందు మజ్జ। ౨౨౪॥
నంబొనర్చుట వారుణ-స్నానమండ్రు॥

ఉ. స్నాననిమిత్తమేగు ద్విజ-సత్తము వెంబడిదప్పిగొంచు వాగ్ని।
పానమొనర్ప దేవపితృ-పక్షి-మరుద్గతి వెంబడించుఁదా।

స్నానమొనర్పఁగా నెవస-నంబులు పిండఁగ రాదు పిండినన్।
దానను వారు నొచ్చికొని-తర్పణముల్గొనఁ నొల్లరా పయిన్॥ ౨౨౫॥

గీ. తర్పణములకు మును పరి-ధానములను।
వలదు పిండంగ రోమకూ-పముల నిడ్డ।
తిలలు గొని తర్పణంబులు-దీర్చుటొప్ప।
దవియు రక్తపురీషంబు-లట్టులగుట॥ ౨౨౬॥

క. జలకమ్ము సేసి తడి తల।
దులిపెడు వాఁడుఁ దడిబట్ట-తో మలమూత్ర।
మ్ములు సేయు వాఁడు నుంజల।
ముల నిలబడి యాచమించు-మూఢుఁడు వీరల్॥ ౨౨౭॥

గీ. దైవపిత్ర్యకర్మములు సేయఁ-దగరు బట్టఁ।
గంతమున నొండె దల నొండెఁ-గప్పికొనియుఁ।
గచ్చ విడిచియు మఱి జుట్టుఁ-గట్టకయును।
జందెమరియును నాచమిం-చంగఁ దగదు॥ ౨౨౮॥

గీ. దరినిఁ గూర్చుండి నీటఁ దుం-పరలు చిలుకు।
నట్టులును నీట నిలచి పై-గట్టు మీఁదఁ।
దుంపురులు పడునట్లాచ-మింపఁ దగదు।
రెండుఁ దాఁకుచు వార్చుట-రెంటశుద్ధి॥ ౨౨౯॥

క. జలకము గొన్నెడఁ బైటవె।
డలినప్పుడుఁ గూర్కినతఱి-డప్పియు సాపా।
టులు గొన్నెడఁ దుమ్మినవలు।
వలు గట్టిన పట్ల రెండు-వార్పులు వలయున్॥ ౨౩౦॥

క. తుమ్మినను నుమిసినను దం।
తమ్ముల నెంగిళులు తగిలి-నం బతితులతో।
నెమ్మది మాటాడిన నన్య।
తమ్మాడినఁ గుడి చెవి నిస-తము ముట్టవలెన్॥ ౨౩౧॥

క. ద్యుమణియుఁ జందురుఁడు న్వే।
దములు హుతాశనుఁడు మారు-తము జలమును ని।
త్యముపావనిపలపలిక। ౨౩౨॥
ర్ణమునన్వసియించిపావ-నము సేతురొగిన్॥

సీ. భాస్కరకరదీప్తి-వన్నెకెక్కినదివా,
స్నానమెల్లరకుఁబ్ర-ధానమగును।
గ్రహణకాలములమా-త్రము రాత్రులుపవిత్ర,
ములగుఁగావునస్నా-నములును హోమ।
ములుజపములుదాన-ములునప్పుడొనరింప.
వలయునితరరాత్ర-ములఁబవిత్ర।
ములగుటమజ్జనా-దులునెవ్వియేనియుఁ,
దగవురుద్రులు దేవ-తలును వాయు।

గీ. వులునునాదిత్యులునుఁబశు-వులునుగ్రహణ।
కాలములయామినీనాథుఁ-గలసియుంద్రు।
గాననట్టిసమయములు-దానమునకుఁ।
బాత్రములటంచుఁదెలియంగ-వలయుమతియు॥ ౨౩౩॥

గీ. కళ్లమునరాశిపోసిన-కాలమందు।
సంక్రమణమందుఁగళ్యాణ-సమయమందు।
గ్రహణవేళలయందును-రాత్రిదాన।
మొప్పఁజేయంగఁగూడదొం-డొక్కరాత్రి॥ ౨౩౪॥

గీ. గ్రహణములయందువలెనెయ-జ్ఞములయందు।
మరణసమయమునందుఁ గు-మారజనన।
మందురాత్రులదానంబు-నాచరింప।
వలయునొండొకరాత్రిని-వలదుచేయ॥ ౨౩౫॥

గీ. రేలఁగ్రొత్తెడునాలుగు-జాలునందు।
నడిమిరెండుమహానిశ-నాఁగనొప్పు।

మొదలుతుద రెండుజాములఁ-బుదినమందు।
వలెనుస్నానంబు సేయంగ-వచ్చుమతియు॥ ౨౩౬॥

చ. మననముఁదజ్జపక్షమును-మాలనియామము సోమమమ్మురా।
క్షననము వీని రాత్రిద్విజ-సత్తముఁడంటినఁగట్టుబట్టతో।
వెనజలకమ్మొనర్చునది-పీనుఁగు పెంటలుతీయుమున్న వె।
క్రొ-నపడియేడ్చుటొప్పదవ-గాహము సేయుటయొప్పు నేడ్చినన్॥

క. చచ్చినపదినాళ్ళనడుమ।
హెచ్చినవవటూపలేక-యేడ్చినదురితం।
బచ్చుపడ వార్చితొలఁగన్।
వమ్మౌనుద్విజులెల్లనను చు-వలయుం దెలియన్॥ ౨౩౭॥

గీ. గ్రహణసమయంబులందుగం-గానమంబు।
లగుసమస్తోదకమ్ముల-ట్లగుటస్నాన।
దానముఖకర్మములకును-త్తమము గాన।
నెల్లరును వానిఁదీర్చుట-యే ఘనంబు॥ ౨౩౮॥

గీ. దర్భజలములఁ జేసెడు-తానము మతి।
వేళ్ళదర్భలు చుట్టికా-వించు వార్పు।
కుశజలంబుల నెగజల్లు-కొనెడునీరు।
సమములివియూఁడు సోమపా-నమునకెపుడు॥ ౨౪౧॥

గీ. అగ్నికార్యము సేయని-యతఁడు వేద।
మభ్యసించని వాఁడు సం-ధ్యలను వార్చ।
నట్టి వాఁడును శూద్రుని-యట్లు గాన।
శక్తియున్నంత వేదంబుఁ-జదువవలయు॥ ౨౪౧॥

చ. నిరతము గాఁపు వంటఁదిన-నేర్చిన వాఁడును శూద్రునింటఁగా।
పుర మొనరించు వాఁడునఘ-పుణ్యములం ఘ్రిజుచే నెఱుంగు వాఁ।
డొరిమను రెడ్డిపీటపయి-నుండునతండును వీరు వేదముల్।
గఱచుచు వేల్పుచున్న నర-కంబునఁగూలుదు రెంత వారునున్॥

ఆ. కాఁపుదాని చేత - సాపాటుఁ దినువాఁడు।
కాపుసాని నాలు - గావరించు।
నట్టివాఁడు వీరు - హవ్యకవ్యములోన।
ర్పంగ దఁగ రెపుడు నరక - పాత్రులగుచు॥ ౨౪౩॥

ఆ. శూద్రు నన్నమొండె - సూతకాన్నంబొండెఁ।
బురిటియన్నమొండెఁ - బొట్టనించి।
బ్రతుకు నతుచ్ఛుఁడెట్టి - పాపజన్మంబుల।
నెత్తఁగలఁడొ యెఱుఁగ - నేమి చెప్ప॥ ౨౪౪॥

క. పదిరెండు తలలవఱకును।
బెదగద్దగఁ బుట్టుచుండ్రు - పిదప నసహ్య।
స్పదమగు పందిగఁ బదియె।
త్తుదు రాదురు కుర్కురములుఁ - దుదయేడుతలల్॥ ౨౪౫॥

ఆ. కాఁపుకొఱకు జన్ని - గట్టుఘృతముదబ్బ।
పేత్తుగలిగి యొకటి - వ్రేల్చెనేని।
కాఁపువాఁడు జన్ని - గట్టును నాజన్ని।
గట్టుకాఁపువాఁడు - కాఁగలండు॥ ౨౪౬॥

గీ. పూని నియమంబు కలుగు బ్రా - హ్మణుఁడు గుడుచు।
నెడల మాటాడెనేనిఁ దాఁ - గుడుచు గుడుపు।
విడుచు నది విప్రవరుఁడు తాఁ - గుడుచు కంచ।
మెత్తి నిర్ద్రావుటఘమని - యెఱుఁగవలయు॥ ౨౪౭॥

క. తినునెడ్డవగొని నిర్ద్రా।
వినద్విజుఁడొనరించు దేవ - పితృకర్మములె।
ల్లను నిష్ఫలమైచనువాఁ।
డును నరకమునందు వెసఁబ - డుఁ జెక్కెడుల్॥ ౨౪౮॥

చ. వసుసనుపాఁటువారుతన-బంతిభుజింపఁజివాటునందెలెన్।
ద్వరవిడనాడిలేచుకుల-పాంసనునజ్ఞునిగాద్విజఘ్నుఁగా।
నరయుటలెస్సశాస్త్రిద్ధనియ-మాదులవిప్రులు లేచినంతవి।
స్తరులనుదీసి వేయకయ-స్వస్తియొనర్చుటయొప్పదెప్పుడున్॥

చ. తెలియక చేతు రేనిఁ బిత్రు-దేవతలచ్చటఁ దృప్తిఁ జెందరా।
కులవెనుకన్ భుజించుటయుఁ-గూడదు దీపములేక రాత్రి వే।
ళలభుజియింపఁగూడదు జ-లంబులఁ గ్రుంకక ప్రేల్మియున్ జప।
మ్ములనొనరింపకే తిగదు-బోనము సేయుటలగ్రజాతికిన్॥ ౨౫౦॥

సీ. తనకుటుంబముపైన-దయఁగలవాఁడయ్యుఁ।
గరుణమైఁ బోష్యవ-ర్గమునుఁ గూడ।
రక్షించునట్టిధ-ర్మమునువిచారింప,
వలయునట్లొనరించు-వాఁడు న్యాయ।
వర్తియై పరలోక-వాంఛఁ గల్గినవాఁడు,
నగు న్యాయమార్గంబు-ననుసరించి।
తానుగడించువి-త్తమునఁ దన్నును దన,
వారినిఁ బోషించు-వాఁడు ధన్యుఁ।

గీ. డన్యథా తెచ్చి జీవించు-నతఁడు సర్వ।
కర్మములకును బాహ్యుఁడౌఁ-గాననట్టి।
జీవితము హేయమనుచు యో-జించి దాని।
విడువవలె బుద్ధిగలయట్టి-విప్రవరుఁడు॥ ౨౫౧॥

గీ కపిలధేనువు చయనుఁడు-కడలియతియు।
శ్రోఁడు సత్రము వేసిన-వాఁడు వీరి।
దర్శనముఁ జేయుచున్నఁ బా-తకములడఁగుఁ।
గాననిరతము వారిని-గాంచవలయు॥ ౧౫౨॥

క. అరణిఘృతమిట్టిచర్మము।
చిరత్నారత్నీములునల్ల-చీలియునువ్వుల్।
మరియుసుగంధముమేకయు।
సురక్షితముసేయవలయు-సూగేహమునన్॥ ౨౫౩॥

గీ. ఒక్కకోడెయునూఱావు-లుండఁగలుగు।
పొలమునకుఁబదియంతలు-పోలునొక్క।
గోవుచర్మముగావున-గోవుచర్మ।
మంతభూదానమిలమహా-ఘాఘహరము॥ ౨౫౪॥

గీ. మనసువాక్కునుగాయక-ర్మములచేత।
సలుపఁబడుబ్రహ్మహత్యాది-సర్వదురిత।
చయమునునడంచునొక్కగో-చర్మమంత।
భూమిదానంబుదానికిఁ-బోలదెదియు॥ ౨౫౫॥

గీ. పెద్దసంసారముగలిగి-బీదయైన।
శ్రోత్రియునికిట్టిదానమి-చ్చుటయెశుభము।
నిరతభూమ్యపహర్తతా-నెంతదాన।
ధర్మములుసేసిననుబవి-త్రతఁగనండు॥ ౨౫౬॥

గీ. ఎన్నిగావులుమఱియును-నెన్నినూతు।
లెన్నిచెఱువులుత్రవ్వించె-నేనివంద।
వాజపేయములేచేసి-ప్రబలెనేమి।
లేదుభూమ్యపహర్తకు-లేదులగ్గు॥ ౨౫౭॥

క. పదునెనిమిదిదినములలో।
ముదితబయిలుటయయిన్నస్నా-నమునశుద్ధియగున్।
బదునెనిమిదికొక్కుఁడునయో।
నదినత్రయమంచనెనుశ-నసమునివరుఁడున్॥ ౨౫౮॥

గీ. పాపిముట్టుత బాలింత-పంచముండును।
నిలనొకటి రెండుమూండునా-ళ్లేసి బార।
లెవము గానుండవలెను గా-దేనికట్టు।
పుట్టములతోడనీటిలో-మునుఁగవలయు॥ ౨౫౯॥

గీ. తనకుఁదెలియమిఁబైవాంద్రుఁ-దాఁకెనేనిఁ।
దోడనేగ్రుంకిసూర్యునిఁ-జూడవలయు।
బాహ్మణుండుచేతులుండియు-వంగిసోట।
జలముద్రావినచో వేపి-జన్మమెత్తు॥ ౨౬౦॥

సీ. ఆలితోనిఁకఁజన్న-నమ్మకుమగడంచుఁ,
గినుకమైఁబలినవ-ట్టినయతండు।
మరలఁబెండ్లాముతో-మాటాడఁదలఁచిన,
విప్రులఁబిలిచి-ప్పిదముదెలిపి।
యయ్యయాఁకలిడప్పి-యలయికజడుపును,
నెకొకనఁబల్కి-నిక్కమిట్లు।
మఱివేఱుకాదీరు-మన్నించిప్రాచిత,
మునుదెల్పఁడనుచువే-డ్కొనఁగవలయు॥

గీ. నిట్టివాఁడనువిప్రున-కిత్తుననుచుఁ।
బలికియీకున్నవాఁడుచే-వలెనుబున్నె।
మనుచుయత్నించియట్లుచే-యనియతండు।
వీరుమువ్వురునొకరాశి-వారుగాను॥ ౨౬౧॥

తే. మూఁడువేళలయందును-బుణ్యనదులు।
గలసికొనుచోటఁగ్రుంకుచ-త్యలఘునిష్ఠ।
మూఁడుదినములునిట్టిల్లి-మొదవుదాన।
మిడిపదుగురగ్రజన్ములఁ-గుడుపవలయు॥ ౨౬౨॥

ఆ. చేయఁదగినపనులు-సేయక చేయంగఁ।
దగనిపనులనెల్లఁ-దగనొనర్చు।
నగ్రజన్మునింట-నన్నంబుఁదిన్నచో।
నొక్క-నాఁడుపోష్య-ముండవలయు॥ ౨౬౩॥

గీ. ఇలువడిగలట్టిబ్రాహ్మణు-నింటమఱియు।
వేదవేదాంతవేత్తయౌ-విప్రునింట।
భోజనమ్మొనర్చువాఁడొక-పూటలోన।
నఘము లేదఁబాసి పుణ్యాత్ముఁ-డగునిజంబు॥ ౨౬౪॥

ఆ. వాంతిచేసికొనియు-వాకిటనుండియుఁ।
బ్రసవమయ్యుమూత్ర-ముసలిపియును।
గంకటిపయినుండి-కాలంబు చేసిన।
నెనయవలయుమూఁడు-కృచ్ఛ్రములను॥ ౨౬౫॥

సీ. గాయత్రిపదివేలు-గావించుటయునుబ్రా,
ణాయామశతయుగ-మాచరించు।
టయుఁదీర్థయాత్రల-కయిరెండుయోజన,
ములునడచుటయును-బుణ్యతీర్థ।
ములయందుఁగ్రుంకుచుఁ-దలయార్చితోడనే,
తిరుగఁగ్రుంకుట-చిటుప-దియునురెండు।
మాఱులొనర్చుట-మహిఁగృచ్ఛ్రమునకుఁబ్ర,
త్యామ్నాయములునాల్గు-తనరుచుండు॥

గీ. గానదానికిబదులివి-పూనవచ్చు।
వెండిగృహమేధిశుక్లంబు-పృథ్విఁబడఁగ।
వలసిచేయఁబ్రాణాయామ-ములనుమూఁడు।
సలిపిగాయత్రివేయియు-సలుపవలయు॥ ౨౬౬॥

గీ. వేదములునాల్గుఁజదివిన-విప్రవరుఁడు।
బ్రహ్మహంతకుశాస్త్రోక్త-ఫక్కి-సేతు।

యాత్ర సేయుటయే ముఖ్య-మైనగొప్ప।
పాచితంబని బోధింప-వలయు నెపుడు॥ ౨౬౭

ఉ. ఎల్లియుఁ బావలుం గొనక-హీనుల నెద్దియు నాల్గుజాతులం।
దెల్లెడ బిచ్చమెత్తికొను-చే ద్విజహంతను పాపకర్మముల్।
గొల్లగఁ జేసినాఁడనిది-గోబికిరంబును వేయుఁడీయటం।
చిల్లిలుఁ జెప్పికొంచునిటు-లేగఁగ నొప్పను సేతుయాత్రికుణ్॥

సీ. ఈవిధంబున నేగి-యేళ్వాళ్ళపట్టణం,
బులడవులాశ్రమ-ములుకొలఁకులు।
నూటలునుం దొడ్డి-తోటలు వీనియం,
దెల్లెడఁ బాపముల్-దెల్లముగను।
వెల్లడి చేసికొం-చల్లనమున్నీరుఁ,
బొందినూటాఱుడ-పొడవు మఱియుఁ;
బదియామడ వెడల్పు-పరిధవిల్లఁగ రఘు,
రాము నానతి వాన-రప్రభువగు॥

గీ. నలుని చేరచితంబయి-చెలువు మీఱు।
బ్రహ్మహత్యాపహంబగు-వంతెనఁగని।
నెమ్మదినిఁ గ్రుంకిపిదపనిం-టికరుదెంచి।
పాఱులను బుత్రమిత్ర సే-వకులఁ గలసి॥ ౨౬౯

గీ. ఓజఁదిని నూటయొకావు-నొసఁగవలయు।
వేదములు నాల్గుజదివిన-విప్రవరున।
కట్లొనర్చి ద్విజాశీస్సు-లందికొన్న।
బ్రహ్మహత్యావిముక్తినిఁ-బడయవచ్చు॥ ౨౭౦

గీ. ధరణిపుండైన నశ్వమే-ధంబు సేయ।
వలయు బ్రహ్మఘ్న దోషంబు-పాయుకొఱకు।

స్వామిదమ్మనుజంపిన-భూమిలోన।
బ్రహ్మహత్యావ్రతంబును-వలయుఁజేయ॥ ౨౭౧॥

క. ఒకసారిదైనసారా।
యికుడిచినట్టిఁడిహపరము-లివిరెంటనుఁబా।
తకుఁడగుఁగావునవాఁడ।
గ్నికనఁగమసలించివాని-నేత్రావఁజనున్॥ ౨౭౩

గీ. అగ్రజానిబంగరువునెవ్వఁ-డపహరించు।
వతఁడురోకలిఁజేకొని-యధిపుకడకు।
నేగితప్పిత్తమునులెస్స-నెఱుకఁజేసి।
కొట్టిపండింపుమఁడనుచుఁదాఁ-గోరవలయు॥ ౨౭౪॥

గీ. దానిఁజేకొనిమన్నిడు-వానిఁగొట్ట।
వలయునద్దానవాఁడుచా-వకబ్రతికినఁ।
గూడనిర్దోషియ, యెఱింగి-కొన్నఁజంప।
నొప్పనొండొకయెడఁజంపు-టొప్పదతని॥ ౨౭౫॥

ఆ. జలమునందుఁబడ్డ-చమురుచుక్కవితాన।
దురితమెల్లనతని-తోడనుండు।
నడచుమాటలాడు-కుడుచుఁబన్నుండుకూ।
ర్చుండువారినెల్ల-నిండికొనును॥ ౨౭౬

క. మొదవులవెంటఁజరించుట।
యుఁదులాపురుషంబుయవల-యౌరెముదింటల్।
పదఁపడిచాంద్రాయణమి।
వ్విదురితచయములనడంచి-వేయంజాలున్॥ ౨౭౭॥

---

తులాపురుషమనఁగా, తెలకపిండి, పచ్చివస్తువులు, మజ్జిగ, నీరు, పిండి, ఈయై
దు నొక్కొక్కదినము భుజించి పిదపమూఁడుదినములుపవాసముసేయుట.

గీ. ఇలఁబరాశరుఁడేనూఱు-నేడుపదుల।
పద్యములసంగ్రహించినఁ-పరమధర్మ।
శాస్త్రమిదిస్వర్గకాములు-శ్రద్ధధాను।
లగుచశ్రుతులట్లదీనినిఁ-దగుఁబఠింప॥ ౨౭౦॥

ద్వాదశాధ్యాయము సమాప్తము.

మ. సతతావర్జితసర్వశత్రునికరా-సంరక్షితానేకయ।
స్థిత!వంశ్యాత్రివినిర్జితోరగపతీ,-దేవేజ్యభీదాయిస।
న్మతివైదగ్ధ్య,దిగంతవిస్తృతయశో-నైర్మల్యవిస్తార,హా।
రితగోత్రాంక, భుజంగరాయకవిరా-ట్పృధ్వీశచూడామణీ॥

మాలిని— హారితకులపవిత్రా-న్యాయ్యవిద్వచ్చరిత్రా।
సరససుకవిమిత్రా-సజ్జనస్తోత్రపాత్రా।
హరచరణసపర్యా-వ్యాపితజ్ఞానధుర్యా।
భరితసుజనవర్యా-బంధుదాక్షిణ్యచర్యా॥ ౨౭౧॥

గద్య. ఇది నిరుపమాన కరుణాసనాథ శ్రీసర్వమంగళానాథ
ప్రసాదాసాదిత సరసకవితావిహార రామలక్ష్మ్యంబా
బుచ్చివేంకయమంత్రీంద్ర కుమార శాండిల్యగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర సుకవిజనవిధేయ ప్రభా
కరనామధేయప్రణీతంబయిన శ్రీమదాంధ్ర
పరాశరస్మృతియను ధర్మశాస్త్రంబునందు
తృతీయబింబము సర్వము
సమాప్తము. శ్రీశ్రీశ్రీ.